# ఆంధ్రభూమి

S.D. RAO

జనవరి,
1942.



సంక్రాంతి
సంచిక.

విడిసంచిక
4 అణాలు.



నాటకకళా పరిషత్ పదునొండవ సమావేశములో
సన్మానింపబడిన ఆంధ్రుల ప్రఖ్యాతతార
నటకళాశారద శ్రీమతి పసుపులేటి కన్నాంబ.

ఒక్క—మాట—

కథ పురాణకాలపుదైనా ఉత్తేజిత సామాజిక సంఘ
టనలతో మొదటినుంచి చివరవరకు పరుగెత్తుతుంది.

—: తారాసందోహం :—

| | |
|---|---|
| కన్నాంబ | పద్మావతీదేవి |
| సి. ఎస్. ఆర్. | ఎ. వి. సుబ్బారావు |
| రామకృష్ణశాస్త్రి | టి. రామశేషన్ |
| ఆరణి | మొదలగువారు |

గృహలక్ష్మి కుంకుమరేఖలతో కులకాలి. పెండ్లాలమీద మగళ్ల,
మగళ్లమీద పెండ్లాల అత్యాచారాలు అడుగంటాలి. కలియుగంలో
దాంపత్య జీవితం కలకలలాడాలి. అప్పుడే సంఘానికీ, జాతికీ, విశ్వ
మానవ ప్రపంచానికీ నిత్యకల్యాణం, పచ్చల తోరణం.

—1942 లో యీ సందేశాన్నిచ్చి నూతన యుగో
దయారంభానికి ఢంకాబజాయించే ఆదర్శ భారత సతీశిరో
రత్నమ్

శ్రీ రాజరాజేశ్వరీ వారి

# సుమతి



డైరెక్టర్ _ కె. నాగభూషణం





సంక్రాంతిపండుగనాడు, సకుటుంబముతో విని ఆనందించండి.

శ్రీమతి
టి. సూర్యకుమారి

విశ్వకవి
రబేంద్రనాధ
ఠాకూరు
జ్ఞాపకార్థము
పాడిన ప్రత్యేక
గీతములు

CA.1451
సుకవీంద్ర ఓర వీంద్ర
స్త్రీజాతికి మోక్షము

ఓడియన్
రికార్డులలో
వినండి

సరస్వతీ స్టోర్సు
మౌంట్ రోడ్
మదరాసు.

గ్రామోఫోను డీలర్లందరి దగ్గర దొరకును.

ఆంధ్రభూమి

సంపుటం : ౧౦. వృష, పుష్యము : జనవరి, 1942. సంచిక : 3.

# సంపాదకీయ సమాలోచన



**నాటక కళాపరిషత్తు**

డిశంబరు ఆఖరువారంలో శ్రీ డి. వి. సుబ్బారావుగారి అధ్యక్షతను మదరాసులో కూడిన పదకొండవ నాటక కళాపరిషత్తు అనేకవిధాల ప్రశంసనీయమైవుంది. ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాల్లో నాటక కళాభిజ్ఞనతో పనిచేస్తున్న నాటక సంఘాలను ఆహ్వానించి వానిచే వివిధరీతుల నాటకాలు ఆడించడం నిజంగా మెచ్చతగిన విషయం. కళాభిజ్ఞుల కాపురపు కాణాచి ఐన మదరాసులో ఆ నాటక సంఘాలకు ప్రదర్శనభాగ్యం లభింపజేయడం బాగా సముచితమైవుంది. ప్రదర్శితమైన నాటకాలకు పరీక్షకుల నేర్పరచి వారి ఆమోదాన్నిపొందిన నాటకాన్ని ఆడిన నటకులకు బహుమతుల నిచ్చారు, అంతేకాదు. ఈయేడు నాటకకళాపరిషత్తువారు ఒక సుప్రసిద్ధ నాటకకారుని, ఒక సుప్రసిద్ధ నటిని సన్మానించారు. నాటకకారుడుగా, నటకుడుగా ఆంధ్రలోకంలో పేరుమిగిలిన శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి షష్ఠిపూర్తి మహోత్సవాన్ని నిర్వహించి ఈయేట నాటకకళాపరిషత్తువారు ఉచితజ్ఞుల మన్ననల నందినారు. నాటకకళాపరిషత్తువారిచే సన్మానమందిన నటి శ్రీమతి కన్నాంబ. నాటకాలలోనూ, సినీమాలలోనూకూడా వేషధారణంచేసి, చేస్తూ ఆమె పేరు కెక్కివుంది. ఈ ఆంధ్రనటి తమిళ సినీమారంగమునకూడ ప్రవేశించి అరవల జేజేలు అందుకొని ఆంధ్రకీర్తిని విస్తరింపచేస్తూవుంది. అట్టి నట్టువరాలిని సమ్మానించి నాటక కళాపరిషత్తువారు ఆమెకు నాటకకళావిశారద అనే బిరుదాన్ని ఈయడం నాటకలోకానికి మోదావహ విషయం కాగలదు. ఇన్ని మోదావహ విషయాల్ని చేశాను కదా అని నాటకకళాపరిషత్తు తిరిగి యథారీతిని నిద్రాణం కాకూడదు. మాదృష్టిలో నాటకకళాపరిషత్తు నిర్వహింపవలసిన ప్రధాన కార్యమొకటి వున్నది. అది ఏమిటంటే ఆధునిక పరికరాలతో కూడిన ఆదర్శప్రాయమైన నాటకశాలను ఒకదానిని మదరాసులో నెలకొల్పడం. అట్టిది ఒకటి నెలకొల్పబడిననాడు ఆంధ్రనాటక కళాపరిషత్తుకు స్థిరత్వం ఏర్పడుతుంది. ఆ నాటకశాలకు అనుబంధితమై నాటకకళాపరిషత్తువారి శాశ్వత కార్యస్థానం నెలకొనవచ్చు. కాబట్టి ఈయేటి నాటకకళాపరిషత్తు కార్యనిర్వాహక వర్గమువారు అట్టి నాటకశాలా నిర్మాణంకోసము విశేషంగాకృషిచేసి కృతకృత్యులు కావడం వాంఛనీయం, నటనటీ బృందంతోను నాటకాభిమానులతోను నిండియున్న మదరాసు మహానగరంలో నాటకకళాపరిషత్తువారి శాశ్వత కార్యస్థానం నెలకొల్పడమే కాకుండా యువతీ యువకులకు నాటకకళనుగురించి శిక్షణకోసంగా విద్యాలయాన్ని కూడా స్థాపించాలని మాకోరిక. నటనటీ బృందము నాటక సమాజాలూ కొంచం శ్రద్ధవహిస్తే అది

సులభసాధ్యమని మావిశ్వాసం. ఇప్పుడు మదరాసులోవున్న సుప్రసిద్ధ నటనటీ భృందము ఒక సంఘంగా ఏర్పడి నాట్యకళాపరిషత్ కు మదరాసు శాఖగా కార్యక్రమమునకు కడంగుదురని ఆశించుచున్నాము.



**అఖిల భారత మహిళాసభ.** అఖిలభారతసంస్థలలో ఆంధ్రులకు అర్హస్థానం లేకున్నదని మనం తరుచు వాపోతూవుంటాము. కాని ఆ అఖిల భారత సంస్థల నిర్వహణానికి మనం ఎంతవరకు దోహదమిస్తున్నాము అనే విషయాన్నిగురించి మనం ఆత్మపరీక్ష చేసుకోము. ఒక్కసారి తప్ప ఆంధ్రుడెవ్వడూ అఖిలభారత కాంగ్రెస్ కు అధ్యక్షత వహించలేదని కించపడతాము. కాని కాకినాడలో తప్ప మరి ఒకసారి ఎప్పుడూ కాంగ్రెస్ను మనం ఆహ్వానించి వుండకపోవడాన్ని మనం విస్మరిస్తాము. అఖిలభారత సంస్థల్లో మనం ఎక్కువ పలుకుబడి సంపాదించాలంటే మనం ఎక్కువ త్యాగాన్ని చూపుతూ వాని నిర్వహణంలో ఎక్కువ బాధ్యతవహించాలి. ఈసత్యాన్ని ఆంధ్రపురుషులకంటె ఆంధ్రస్త్రీలు బాగా గ్రహించినట్లు కనిపిస్తుంది. అఖిల భారత కాంగ్రెస్ను ఆసంస్థ పుట్టిన ఎన్నాళ్ళకో కాని మన పురుషులు తెనుగుదేశానికి ఆహ్వానించలేదు. మనస్త్రీలు అట్లా కాక అఖిలభారత మహిళాసంస్థను ఆ సంస్థకు ఇంకా మైనారిటీ దాటకుండానే ఈయేడు కాకినాడకు ఆహ్వానించారు. మన స్త్రీలు చేసిన ఈ కార్యంచాలా మాన్యమైవుంది. మాన్యమైన ఈ కార్యనిర్వహణభారం విశేషంగా వహించిన ఆంధ్రరమణీమణి శ్రీ పిఠాపురము యువరాణీవారు. ఆమెకు ఆంధ్రభూమి హృదయపూర్వకమైన ప్రశంసలను తెలుపుకుంటూవుంది.

# దరిద్రంలో కవిత్వం

[చిన్న కథ]

'బీదకవుల రచనలు కారుచౌకలో కొట్టేస్తూ... బొర్ర పెంచేసుకుని... ఇవాళ ఎలా అలంకరించావో కొట్టు! గుమ్మంముందు కదళీస్తంభాల్లో దుర్భోజనంలో కృశించి మడిసిన బీదకవుల కంకాళాలు ... గుమ్మాలకు కట్టిన ఆకుతోరణాల్లో పేదకవుల ఆకలిపేగులు...'

రచయిత:

## పురాణం కుమారరాఘవశాస్త్రి, బి.యే.

౧

విజయదశమినాడు—

మామూలుగా ఆరుగంటలు కాకముందే లేచి, చంటిదాన్ని భర్తమంచంమీదికి మార్చి, తన పక్క చుట్టేసుకుని, పాచి పనుల్లో నిమగ్న అయింది సరస్వతి.

ఏడుగంటలు అయాక, అతనికి మెలకువ రాగానే— అంతకుముందే పసిది లేచి ఎంతసేపయిందో మరి—పక్కనే కూచుని, ముక్కు, చెవో పట్టిపీకుతూ, జిలిబిలి కేకలు వేస్తూ, తన్ను లేపటానికి తంటాలు పడుతూండటం చూచాడు. అతడు కండ్లు తెరవగానే ఆ పిచ్చి పాపాయిముఖం ఇంతై—నోరంతా దాకలాగ తెరచి—కింది వరసలో వచ్చిన రెండుపళ్ళూ అందం చిలుకుతూంటే— ఎన్ని జన్మాల బాంధవ్యమో పులకరించేట్టుగా ప్రవహించింది.

వెల్లకిల పడుకున్నవాడు లేవకుండానే, మీది కెగబ్రాకి వస్తోన్న పసిదాన్ని గుండెలమీది కెత్తి కూచోబెట్టి పట్టుకున్నాడు.

ఏమి చిలిపితనం! కొంటెపిల్ల! క్షణంసేపు ఊరకుండదు కద! రెండు కాళ్ళూ తీసుకొచ్చి తండ్రిముఖాన పెట్టమ్మా? ముందుకు వాలి ఆయనజుట్టు పీకుతూ, చెంపలు రక్కుతూ నానా అల్లరి చేస్తోంది. ఇంత అవమానం జరుగుతున్నా అతడూ ఉప్పొంగి పోతున్నాడు. దాని చిలిపి కేకలను కసరుకోడేం? వాటిల్లో సృష్టిసౌందర్యాన్ని కురిపించిన ప్రకృతిమాత గానం వింటున్నాడా?

కన్నులు బాగా తెరిపిడి పడ్డా— ఇంకా బాహ్యప్రపంచం మూసుకముందే—ఆ పసినిసుగు సృష్టించిన వేరే ఒక అనిర్వచనీయ- ఆనందమయ- అమృత ప్రవాహంలో మునకలు వేస్తూ - నిద్రాజాగ్రదవస్థల తారతమ్యం తెలీనిస్థితిలో- ఆత్మ కింపైన భోజనానికికూడా మొగం వాచిన బీదకవి నన్నసంగతే మరచిపోయి—తానుకూడా నిలువునా ఒక పసిపాప అయిపోతూ ఉన్న ఆ దివ్య ముహూర్తాన—

'అయ్యో కూతుళ్ళకు ఎంత పొద్దెక్కిందోకూడా తెలీటం లేదు; ఇక లేవమ్మా. మీరు దబ్బున తలంటి పోసుకుని బజారు కెళ్ళి రావాలి కూడాను,' అంటూ మెల్లాలో సరస్వతి పిల్లదానికి ఉగ్గు పెట్టేందుకు గూటిలోనించి ఆముదంగిన్నె తీస్తూ కనిపించింది అతనికి.

మధురగానంలో అపశ్రుతి!

ఉగ్గుగిన్నె కిందబెట్టి సరస్వతి వచ్చి తండ్రిదగ్గరి పిల్లదాన్ని తీసుకొచ్చేసింది.

అతడు మంచంమీద లేచికూచుని, కిటికీగుండా ఆకాశాన బారెడెక్కి వచ్చిన సూర్యబింబాన్ని చూచాడు.

తరువాత మంచందగ్గిరే ముక్కాలి పీటమీద — తను రాత్రి ఆరంభించి, సగంరాసి, ఆపివేసిన కథ ఉన్న కాగితాలు కనిపించినై. పక్కనే సిరాలేని ఫౌంటెన్ కలం, దాన్ని మళ్ళీ ఏ స్నేహితుడింటికో తీసికెళ్ళి నింపుకొస్తేనే తప్ప మిగిలిన కథ పూర్తి అయేమార్గంలేదు.

మంచంమీదినించి లేచాడు. ఆ నాలుగుగోడలకూ ఒక్కటే, గాంధీజీపటం. అపరిగ్రహాకారుడు— అవతారమూర్తి వీక్షణంలోని వాత్సల్యం, దరహాసంలోని ప్రసన్నత్వం—ఈ ఒక్క ఉదయమే కాదు, ప్రతి ఉదయమూ—అతని కొ

అపూర్వ సహనశక్తిని ప్రసాదిస్తూనే ఉన్నవి.

పటం పక్కనే వంకెలకు తగిలించి మాసిపోయిన చొక్కాలూ, పంచలూను. ఇంటికివెళ్ళి, బ'మాలి పిల్చినా రావటంలేదు చాకలివెధవ. ఒక్కనెల జీతం బకాయి పడ్డందుకే ఏమి ఇబ్బంది పెడుతున్నాడు! ఇవాళ పండగరోజున ఒక్క ఇస్త్రీచొక్కాకూడా లేనట్టుందే!

అవతల—పిల్లకు ఉగ్గుపోసేముందు చిటికవేసి ఏడిపించింది తల్లి.

ఏ స్వర్గసౌధంనుంచో మెట్టుమెట్టునా జర్రున జారుతూ వచ్చి వాస్తవిక ప్రపంచంలో బొక్కబోర్లపడ్డాడు ఆ కవికుమారుడు.

కిశోర్ అన్నవాడు తానే ననీ, ఇంతకుముందే నిద్రలేచాననీ తన్ను తాను తెలిసికొన్నాడు.

౨

దొడ్లో ముఖం కడుక్కుంటూ కూచున్నాడు కిశోర్.

పిల్లకు ఉగ్గుపోసి, ఏడుపు సముదాయించి, మాడుకు ఆముదంపెట్టి, పాలిస్తూ కూచుంది మల్లాలో సరస్వతి.

'ఇవాళ పిల్లకు పాలడబ్బా కొనుక్కురావాలండీ!' ... 'మనకు బియ్యంకూడా అయిపోయాయి; ఈపూట కొస్తాయేమో, అంతే'... 'ఇవాళ పండగపూట ఒక్క కూరగాయకూడా లేదు ఇంట్లో' ...'సరేగానండీ, ఎన్నిమార్లు చెప్పినా ఒక్క చొక్కాగుడ్డేనా తీసుకురారేం? పండగరోజులలో పిల్లదానికి వెధవ పాతచొక్కాలు తొడగటానికి సిగ్గేస్తుంటేనూ! నే నెలాగూ ఒక రవికగుడ్డకూడా నోచుకోలేదనుకోండి; పసిదానికిఖర్మంకూడా అంతేనా? డబ్బులేదు, డబ్బులేదు, అంటారు. ఇంతకూ దాని రాత...'

సరస్వతేనా ఆ పలికేది? తనభార్యా?...శత్రువా? ...ఆమె మాటలేనా అవి?...కత్తిపోటులా?— జేబులో నాలుగో, అయిదో అణాలు మాత్రమే ఉన్నసంగతి స్ఫురణకు తెచ్చుకుంటున్న కిశోర్‌కు ఆమాటలు వింటోంటే ఒళ్ళంతా కంపరమెత్తినట్టనిపిస్తోంది.

'నే నెంత గొంతు చించుకుంటున్నా ఒక్కమాటైనా మాటాడరేమో చూడు! అరచి అరచి అదే ఊరుకుంటుందని మీ ఉద్దేశం. ఆడపిల్లకదా, సొమ్ములుచేయించి ఎలాగూ పెట్టలేం; ఇంతమంచి గుడ్డకూడా లేదే అని నా యేడుపు...'

'ఊరికె గొడవచేయకు, సరస్వతీ! సమయాసమయాలు ఆలోచించవేమిటి? మన మేమీ చక్రవర్తులం కాముకదా! పత్రికవాళ్ళ మనియార్డరుకోసం ఎదురుచూస్తూ ఉన్నాను. బహుశః ఇవాళ రావచ్చు. రాగానే పిల్లకూ, నీకూ —'

'అయ్యో, భాగ్యం!'

'ఏమిటి అలా గన్నావు?'

'ఏముంది? రానిబాకీలన్నీ మాకింద జమకడుతూంటా రన్నమాట!'

'ఎబ్బే! ఇవాళ తప్పకండా మనియార్డరు వచ్చేస్తుంది. నావి అయిదు కథలు ప్రకటించుకున్నారు. ఉత్తరంకూడా రాశాను.'

'ఇంకా పంపండి, వేసుకుంటారు. మీ కైన పోస్టుఖర్చులుకూడా రావు. వాళ్ళేం పిచ్చివాళ్ళు కాదు మీకుమల్లే.'

౩

సరస్వతి అన్నట్టుగానే—

మధ్యాహ్నం భోజనాలు అయాక, పోస్టువాడు రాగానే ఆతృతతో 'మనియార్డరు వచ్చిందా?' అని అడిగి, 'లేదండి' అన్న జవాబుతో వాడిచ్చిన కార్డు ఒకటి మాత్రం నిరుత్సాహంగా అందుకుని, పంక్తి పంక్తికీ గుండె నీరయిపోతూంటే—

వాళ్ళ పత్రిక తరఫున రచయితల్ని పురస్కరించటం అలవాటులేదట — అదీ ఉత్తరంలో సారాంశం.

పళ్ళు కొరుక్కుంటూ కిశోర్ ఉత్తరాన్ని ఒకమూల గిరాటు వేశాడు. అటూ, ఇటూ నేల చూస్తూ పాదచ్ఛాయలు సాగించాడు. చివరకొగి ఒక గోడకు చేరగిలబడి నిల్చి, కిటికీలోంచి అవతల శూన్యంలోకి చూస్తూ ఉండి పోయాడు.

ఒక దీర్ఘనిశ్వాసం...

పొద్దున...పోనీ, ఎంతతక్కువకైనా సరే రాసిన నవల అమ్మేసుకుందాం అని పబ్లిషరు పుల్లయ్య కొట్టుకు వెళితే... ఇవాళ కొత్త దస్త్రం పెడుతూ పూజ హడావుడిలో ఉన్నాడు. బీదకవుల రచనలు అతి చౌకలో కొట్టేస్తూ...బొర్ర పెంచేసుకుని...ఇవాళ ఎలా అలంకరించాడో కొట్టు! గుమ్మంముందు కదళీస్తంభాల్లో దుర్భోజనంతో కృశించి మడిసిన బీదకవుల కంకాళాలు...గుమ్మాలకు కట్టిన అకుతోరణాల్లో పేదకవుల ఆకలిపేగులు...లోపల పెద్ద ధనలక్ష్మి విగ్రహం ఎంత, విజయగర్వంతో చూస్తోంది ఆ చుట్టూ బీరువాల్లో బంధింపబడివున్న సరస్వతివైపు. చీ అమకుని

తిరిగి వచ్చేశాను పుల్లయ్యాతో మాటాడకుండానే. ఇక నొక్క ఆశ ఉండే; అదికూడా ఆ ఉత్తరంతో అంతరించింది.

రచయితల్ని పురస్కరించటం ఆచారం లేదట! ఎందుకుంటుంది!...

ఛీ, తెలుగుదేశంలో పుట్టటమే తప్పు. అందులో రచయిత కావటం పురాకృత పాపపరిపాకం. తెలిసికూడా ఆ వ్యాసారాన్నే అంటిపెట్టుకుని ఉండటం వట్టి బుద్ధితక్కువపని.

కిశోర్ దృష్టి అక్కడి ముక్కాలి పీటమీది తన సగంరాసిన కథ ఉన్న కాగితాలమీదికి ప్రసరించింది. ముందుకు వడిచి అవి చేతిలోకి తీసుకున్నాడు.— పైసా విలువకూడా చేయనప్పుడు ఎందుకీ రచన? చింపి పారేస్తాను. ఇవాళ నించీ అస్త్రసన్యాసం.

వద్దు, వద్దు; అంతపనే? నీకు చేతకాదు. పోతనకాలంనాటినించీ దారిద్ర్యాంధకారకుహరాలలోనే ఆధ్యాత్మికపు వెలుగులు చిమ్ముతూ వస్తున్నాను. నన్ను చిదిమివేయలేవు—అంటూ సృష్టికర్తకుకూడా ఆశలు కల్పించే చిరునవ్వు చిలుకుతూ ఉత్తమకళాసరస్వతి ఆ కాగితాలలోంచి తొంగి చూస్తోంది.

చక్రవర్తికికూడా దొరకని అనంబాన్ని తనకోసం విరివిగా పండిస్తోన్న సౌందర్యరాశి! ఆమెపై చెయి చేసుకోగలడా కిశోర్? కాగితాలు వక్షాన హత్తుకుంటూ, కన్నులరమోడ్చి, తల పైకెత్తాడు.

మధుర మందహాసం కురిపిస్తున్నాడు గోడమీది దరిద్రనారాయణమూర్తి.

౪

వంటయింటిపనులు ముగించుకుని వస్తూ 'ఏమండీ! మనియార్డరొచ్చిందా?' అంటోంది భార్య.

ఆ ప్రశ్నతో కిశోర్కు వొళ్ళుఝల్లుమన్నది. మనోవీధిలో మెరసిన తన ఆరాధ్యదైవతం, కళాసరస్వతి ప్రసన్నవదనం తిరోహితమై...ఎదుట ప్రత్యక్షమయింది భార్య సరస్వతి.

చేతిలోని కాగితాల్ని తిరిగి ముక్కాలిపీటమీద పెట్టేస్తున్నాడు కిశోర్.

'మాటాడరేం? మనియార్డరొచ్చిందా?'

వెధవ ప్రశ్న! ఈ ప్రశ్నను ఎదుర్కోవలసి ఉంటుందని పోస్టువాడు వచ్చి వెళ్ళినప్పుడే ఫికరు పడ్డాడు. ఏమి సమాధానం చెప్పి, ముప్పు తప్పించుకోవాలో ఇంతవరకూ పాలుపోవటంలేదు.

వొళ్ళు జలదరింపజేసే ప్రశ్న! ఏం, ఇప్పుడొచ్చి ఈ సరస్వతి ఆ ప్రశ్నే పదే పదే అడక్కపోతే? ఏం ముంచుకుపోతోందని?

'చెప్పరేమిటండీ, ఎన్నిసార్లడుగుతున్నానూ!'

అదిగో మళ్ళీ... జవాబు చెప్పలేదని ఊరుకుంటుందేమో చూడు! ఎందుకూరుకుంటుంది? ప్రాణాలు తోడేస్తుందిగాని. నా దారిద్ర్యాన్ని నాముందు బట్టబయలుగా, అతివికృతరూపంలో, ప్రదర్శించి—సంసారం ఈదలేని నా అసమర్థతను నాకు స్ఫురింపజేస్తూ — ఆత్మహత్యనే ప్రబోధిస్తూ — నేను చచ్చేవరకూ ఊరుకోదు.

'ఇంకా పోస్టువాడు రాలేదా?'

'అప్పుడే వచ్చాడామరి?'— అని తొందరగా అనేసి కాస్త ఊపిరి పీల్చుకోగలిగాడు కిశోర్.

'అసంగతే చెప్పేయకూడదూ? అలా బెల్లంకొట్టిన రాయిలాగ ఉండకపోతే. మీ దంతా తమాషా అండీ!...అరే, ఆ వుత్తరం ఎక్కడిది మరి?'—ఆ మూల ఉత్తరంమీద ఆమెదృష్టి పడనేపడ్డది.

'అదా? నిన్న వచ్చిన ఉత్తరం కామాల్లే' అంటూ ఉత్తరీయం వంకెమీదినించి తీసి బుజాన వేస్తున్నాడు.

ఇంకా తా నక్కడే ఉంటే చాలా గ్రంథం పెరిగే అవకాశాలున్నై. ఆమె ఉత్తరం చదివేసిందంటే, 'అఁ నే చెప్పానుకాదూ' అని విజయపతాకం ఎత్తుతుంది. ఓడిపోయిన రాజులాగ గడ్డికరుస్తూ తాను ఆమెముందు...ఉహుఁ, సహించలేడు. అదికాక తానబద్ధం ఆడాడు. దానిమీద ఆవిడ వ్యాఖ్యానం చేస్తుంది. ఎప్పుడూ ఇలాగే అబద్ధాలాడే వాణ్ణిలాగే మాటాడేస్తుంది. అనా డిట్లా—ఈనా డిట్లా—అని ఎప్పటెప్పటి విషయాలో తవ్వుకొస్తుంది—ఓ, చాలా సంగతులొస్తాయి...

సరస్వతి ఉత్తరం అందుకుని పూర్తిగా చదివేసింది. 'నాతోకూడా అబద్ధా లెందుకండీ!' అంటూ వెనక్కు తిప్పింది ముఖం.

కాని ఏడీ కిశోర్! చరచరా వీధి గుమ్మంవద్దకు వచ్చింది సరస్వతి. కిశోర్ అప్పుడే సందు మలుపు తిరుగుతున్నాడు.

సరస్వతి కన్నులు చెమ్మగిల్లినవి.

డబ్బుకు భర్తను వొత్తిడిచేయటం తప్పే. ఇక నెప్పుడూ చేయనని నిశ్చయించుకుంది. కాని మరి యిల్లు గడచటమో! అది తీరని సమస్యగానే ఉండిపోయింది.

లోపల...గదిలోకి పాకివచ్చి తలెత్తి గాంధీబొమ్మకేసి చూస్తూ, ఏదో అర్థంకాని ఆనందంతో జిలిబిలికేకలు వేస్తున్న పాప తల్లిదుఃఖానికి ఉపశమనం చెప్పింది.

సు
వ
ర్ణ
సుం
ద
ర
ర
స
ము

ఖరోగముల
లన బాధపడు అన్ని వ
ములవారు వేటూరి,
దరశాస్త్రిగారి సువర్ణ సుం
ర రసమును వాడిన, శరీ
మునకు బంగా
మువలె కాంతిగలిగి
వా వ్యాధులన్నియు నిర్మూల
కాగలవని విన్నవించు

మీ విశ్వాసపాత్రులు

## ఆర్ష రసాయనశాల,

ముక్త్యాల (కృష్ణా.)

# 'ఏం? చెల్లీ!'

[ చిన్న కథ ]

—'నా పుట్టింటి వంశానికి వాడు ఒక్కడున్నాడు. వాడు ఎంత నీచుడేనా కానీయండి. వాడు నాసహోదరుడు.' అని కంట నీరెట్టుకుంది లలిత—

రచయిత:

జనస్వామి కోదండరామశాస్త్రి

మాటామంచీ ముచ్చటిస్తూ మాటలమధ్యన ఆగి అకాత్తుగా స్ఫురణకువచ్చినట్టుగా 'ఇందాకటినుంచీ చెప్పటం మరిచాను. లలితా! నిన్న సాయంకాలం మీ మామయ్యకు నెల్లూరు రైల్వేస్టేషన్లో మన రంగారావు కన్పించాడట.' అని అంది సుబ్బమ్మ,

'ఎంతకాలానికి విన్నాను, అత్తయ్యా! మా అన్నయ్యనుగురించీ! వాడ్ని తలుచుకుంటే నాకు ఆపుకోలేని దుఃఖంవొస్తుంది' అంది లలిత కనుకొలుకుల్నుంచి జారుతూన్న జలకణములను చీరెకొంగుతో తుడుచుకుంటూ.

'అవునమ్మా... నీతోడు...నీ పుట్టిల్లు. సగం రక్తాన్ని పంచుకుని పుట్టినవాడు. పెళ్ళిఅయివుంటే యీసరికి నలుగురుపిల్లలతండ్రి ఐ మీనాన్నగారి పేరు మళ్ళీ పైకితీసుకొచ్చేవాడుకాడా? తల్చుకుంటే నాగుండెల్లో ఏమిటోగా వుంటుంది. చిన్నప్పుడు ఆపిల్లవాడు ఎంత బుద్ధిమంతుడుగావుండేవాడూ?' అంది నాలిక విచారంగా చప్పరిస్తో.

'అత్తయ్యా! మా అన్నయ్యని గూర్చిన విశేషాలు యింకా ఏమైనా చెప్పారా? మామయ్య-'

'రాత్రి భోజనంచేస్తూ ఏదో మాటవరసగా యీ ఒక్కమాటా అని వూరుకున్నారు, నేను తిరిచి అడగనూలేదు-'

'మామయ్య వచ్చినాక కనుక్కో.'

'అడుగుతాను. ఏంచెప్తారో; ఏమో? ఆపిల్లవాడిపై ఆయనకు అమితకోపం. తన ఆస్తినంతనీ ముంచుకోవడమే గాకుండా, చిన్నప్పట్నుంచీ పెంచిన ప్రేమవల్ల నాలుగువేల అప్పుకు జామీనుంటే దాన్ని తన నెత్తిమీదకే తోసేశాడని...'

'అది వాడు బుద్ధిపూర్వకంగా చేసినపని కాదమ్మా, అత్తయ్యా! చివరకు ఏకొంచెం ఆస్తిమిగిలినా మీ అప్పుకిందకట్టి నమస్కారం పెట్టి వూరుకునేవాడు. తుపానులో వూపిరిపీల్చుకోడానికి వాడికే శక్యం కాకపోయింది.'

'నిజమే. ఆ అప్పులవాళ్ళ బల్లెపుపోట్లకు తాళలేక కోర్టులో దివాలా అన్నాడు. పోనిద్దురూ, మనచేతులలో పెరిగి పెద్దవాడైన ఆ పిల్లవాడు మనసొమ్ము అంతమాత్రమైనా తినడానికి అర్హుడు కాడా అని నేను ఎంతో నచ్చచెపుతూంటాను. కాని అతనిమాట ఎత్తితేసరి ఆయన కళ్ళు బుస్సలాడుతూంటారు.'

'అదుగో, మామయ్య వస్తున్నారు.' అని అంటూ లలిత గుమ్మానికి పక్కగా తొలిగి నిల్చున్నది.

సుబ్బమభర్త తన చేతికర్రతో భూమిని బలంగా గుద్దుతూ చరచరా లోపలకు వెళ్ళాడు.

'అత్తయ్యా! అడగవూ?' అన్నది లలిత సుబ్బమ్మకుమాత్రమే వినిపించే కంఠధ్వనిలో.

'ఆగు, ఆగు.' అని చేతులతో సంజ్ఞచేస్తూ సుబ్బమ్మ గదిద్వారంలోకి వొచ్చి నిలబడ్డది. భర్త

షర్టూ, వుత్తరీయమూ తీసి స్టాండుకు తగిలించి ఈజీచైర్లో కూలబడుతూండగా 'అయితే, నిన్న సాయంకాలం మీకు రంగారావు కన్పించాడంటిరి కదూ?......'

మాట పూర్తిగాకమునుపే ఆయన అడ్డుతగిలి 'ఊఁ అయితే ...' అని అన్నాడు చీత్కారంగా.

'ఆఁ. ఏమీ లేదు. నేను యీ మాట అంటేనూ, రక్తస్పర్శ కదూ, లలిత అతన్ని గురించి యింకా ఏమైనా విశేషాలు తెలుసునేమో అడగమని...'

'ఏమో? నాకేం తెలియవు. నెల్లూరు స్టేషన్లో కన్పించి మాట్లాడకుండా పక్కకు తొలిగిపోయాడు. మాట్లాడటానికి ముఖం చెల్లొద్దూ?'

లలిత కళ్ళ కొలుకుల్లో నీరు నిండింది: దుఃఖావేశంతో ఆ లేత ముఖం ఒణికిపోతోంది. 'అత్తయ్యా! వెళుతున్నాను. వారు ఆఫీసునుంచి ఒచ్చే వేళ అయింది' అని కన్నీటిని చేతివేళ్ళతో తుడుచుకుంటూ గుమ్మం దాటింది.

'పాపం! వెఱ్ఱిపిల్ల. ఎప్పుడూ అతనిమాట చెప్పగాని కంటనీరెట్టుకుంటుంది.' అంది సుబ్బమ్మ జాలిగా.

'ఎందుకూ కంటనీరు? తన కాపరం తను లక్షణంగా చేసుకోక-'

'ఏం మాటలండీ? అతని విషయమై మీకుమాత్రం విచారంలేదనా? అట్లా మాట్లాడతారుగాని..'

'ఆఁ. వుండి ఏం చెయ్యడం, అంది రాకపోతే...' ఆయన కంఠస్వరంలోని పదును కరిగిపోయింది. పెంచిన ప్రేమ హృదయంలో పొంగి పొరలింది.

౩

లలితభర్త విస్తరిముందు కూర్చొని భోజనం చేస్తున్నాడు. లలిత అతనికి ఎదురుగా నిల్చొనివుంది. ఆమె హృదయం అన్నయ్యనితల్చుకుంటోంది. కండ్లముందు, నున్నగా అలికి ముగ్గుపెట్టిన నేలపై అన్నయ్యస్వరూపం చిత్రితమై తాండవిస్తోంది. తనని పిలుస్తోంది ఆమధుర కంఠస్వరం 'చెల్లీ!...లలితా!...ఎంతకాలమైందమ్మా నిన్ను చూసి ఒక్కసారి నాదగ్గఱ కూర్చొనిపో. అప్పుడే ఎంత పెద్దదానివై పోయావ్.'

'నెయ్యి' అని ఝూంకారింపు,

లలిత, మనసులోని ఆలోచనలిస్తున్న ఆనందంలోనుంచి తెప్పరిల్లుకుని గబగబా అలమరావద్దకు వెళ్ళి వుప్పుతొట్టితీసి భర్త విస్తర్లో పచ్చడికలిపిన అన్నంపై యింతవుప్పు వడ్డించింది.

# ప్రాక్తనభారతంలో వాయువిమానాలు

1881 మార్చి మాసపు థియాసాఫిస్టు పత్రికలో కల్నల్ ఆల్కాట్ ప్రాక్తన హిందూదేశంలోని వాయువిమానాల్ని గురించి ఇట్లా వ్రాస్తున్నాడు :

ప్రాచీనకాలపు హిందువులు విమానయానాన్ని, విమానయుద్ధాన్ని ఎరుగుదురు. విమానవిద్యలో వారు కూలంకష ప్రజ్ఞాధురీణులై వుండిరి.

రామాయణంలో పుష్పకవిమాన ప్రస్తావనకలదు. పుష్పకవిమానం కుబేరుడిది. కుబేరుడికి అది బ్రహ్మ ఇచ్చాడు. కుబేరుడివద్దనుంచి దానిని రావణుడు లాక్కున్నాడు. రావణున్ని చంపిన తరవాత రామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతంగా అయోధ్యకు వెళ్ళడానికి దానిని ఉపయోగించాడు. ఆమీద దానిని రామచంద్రుడు కుబేరుడికి తిరిగి ఇచ్చివేశాడు. పుష్పకవిమానానికి రత్నవర్షకమనే పేరు కూడావుంది. లంకనుంచి బయలుదేరి మధ్యమధ్యను ఆగుతూ ఈవిమానం ఐదు రోజులకు అయోధ్యచెంతగల భరద్వాజాశ్రమానికి చేరింది.

మహాభారతంలో మరియొక వాయువిమాన ప్రస్తావనకలదు. దానిపేరు 'శంభక'. అది సాల్వరాజుది. శంభకవిమానం ఎగిరే పట్టణంగా వర్ణింపబడింది. కృష్ణుడు ఈ విమానాన్ని ద్వారకయుద్ధంలో ధ్వంసం చేశాడు.

వాల్మీకి రామాయణంలో వరుణకుమారులకు, రావణునకు విమానాలతో ఆకాశయుద్ధం జరిగిందని వర్ణింపబడింది. అక్షకుమారుడు, ఇంద్రజిత్తు ఆకాశంమీద వాయురథాల్లో కూర్చుని యుద్ధంచేశారనే వర్ణనకూడా వాల్మీకి రామాయణంలో వుంది.

—*Rao Bahadur*
*R, Krishna Rao Bhonsle*

'ఇదేమిటీ! నెయ్యి అడిగితే పప్పు వేస్తావేం!' అని గర్జన.

'ఆఁ... లేదు...మర్చిపోయాను...' అంటూ గబగబా వెళ్ళి నెయ్యి తీసుకువచ్చి వడ్డన చేసింది.

'కళ్లు అట్లా ఎఱ్ఱగా చింత నిప్పుల్లాగా వున్నాయేం!'

జవాబు లేకపోవడంచూసి 'అసలుకథ ఏమిటే ? ఎప్పుడూ ఏమిటో పరధ్యాన్నంగా వుంటావ్ !'

'అబ్బే, లేదండీ.' అంది బలవంతంగా చిరునవ్వును కల్పించుకుంటూ.

'నేను ఆఫీసుకెళ్ళిన సమయాల్లో తలుపులు వేసుకుని ఏడుస్తూ కూర్చుంటావా ఏమిటే ?' అన్నాడు సరసంగా చిరునవ్వుతో.

'బాగుంది. ఎందుకూ ఏడవడం? కళ్లు బాగా నలపడంవల్ల ఎఱ్ఱబడ్డాయిగాని—' అందామూ, వద్దా అని తటపటాయిస్తో ఛప్పున నోరుజారి అన్నది 'మా అన్నయ్య నిన్న నెల్లూరులో కన్పించాడట మామయ్యకు.'

ఈమాట వినీ వినడంతోనే అసహ్యించుకుంటూ చిరాకుగా 'ఛస్. వాడిమాట నాముందు ఎత్తకు. వాడికంటె పశువే ఓమాత్రం నయమనిపిస్తుంది.' అని కేకవేస్తూ భోజనం పూర్తిచేశాడు.

3

రంగారావు కనిపించకుండా పోయిన పద్నాలుగు సంవత్సరాలకు శలవుగా, ఆసంవత్సరపు సంక్రాంతి పండుగనాడు అతనివద్దనుంచి పోస్టుద్వారా ఒక పార్సిల్ వచ్చింది లలితకు. అందులో సుమారు పాతికి రూపాయల ఖరీదుగల సిల్కుచీరె, రెండు జరీ అంచుల రవికలగుడ్డలూ, చీరె మడతలో అయిదు అయిదు రూపాయలనోట్లూ, ఒక చిన్న కాగితపు ముక్కా వున్నాయి. ఆ కాగితపుముక్కలో చక్కని గుండ్రని అక్షరాలతో ఇట్లా వ్రాసి వుంది :

ప్రియమైన చెల్లీ !

నా శుభాశీస్సులు, ఇవి నీ పుట్టింటి కుంకుమరేఖలు.

ఇట్లు,

నీ పుట్టింటి వెలుగు.

రంగారావు ఎడ్రెస్‌మాత్రం లేదు. ఏవూర్లో పోస్టుచేశారో చూద్దామన్నా పోస్టుముద్దర అక్షరాలుకూడా తిన్నగా కన్పించడం లేదు.

సంతోషంగా ఆచీరె ధరించి భర్తవైపుకు తిరిగి సంతృప్తి సూచకమైన చిరునవ్వుతో 'చూశారా? మా అన్నయ్యపంపించాడు.' అని అంది.

'ఓహో? ఆ ఇన్‌సాల్వెంటు పిటీషనువాడా ?' అని చీత్కారించుకోటం చూచి లలిత కొంచెంచిన్నబుచ్చుకుంది.

'మామూలుమాటలేగా' అని అనుకుంటూ ఓ అయిదునిముసములు గడిచిన తర్వాత ఆనందంగా అంగలువేస్తూ మేనమామ ఇంటికి వెళ్ళింది.

'అత్తయ్యా? చూశావా? నా పుట్టింటి పసుపుకుంకుమ.' అని అం

## కలలు రాకుండా...

మీకు తరుచు కలలు వస్తాయా ?

కలలు కలగడానికి నిజమైన కారణమేమిటో ఇంతవరకు కనుగొనబడలేదు.

అజీర్ణము, మలబద్ధము మొదలయినవి కలల రాకకు కారణం కావచ్చు.

పక్క బాగా మెత్తగావుండడంవల్ల-అన్నంతినడంతోటే నిద్రపోవడంవల్ల స్వప్నాలు రావచ్చు.

కలలురాకుండా వుండాలంటే—

రాత్రిభోజనం అయిన రెండుగంటలు దాటితే కాని నిద్రపోకూడదు.

సులువుగా జీర్ణంకాని పదార్థాలు రాత్రిళ్లు తినకుండా వుండాలి.

రాత్రి భోజనం అయినపిమ్మట కొంత పచారు చేయాలి.

—*Tit-Bits*

టూ తన అన్నయ్య పంపిన వన్నిటినీ ఆమెకు చూపింది.

'విన్నాను. ఇందాక మార్కెట్‌లో కనిపించి మీ మామయ్యతో మీ ఆయన చెప్పాడట.'

'అత్తయ్యా! మా అన్నయ్య జీవితం కొంచెం తేట పడ్డట్లుంది.'

'ఆతని కేవమ్మా? విశేషంగా చదువుకున్నవాడు. వానాకాలపు చదువుకూడా కాదు. అవేవో పెద్దపరీక్షలుకూడా ప్యాసైనవాడు.'

'ఎం.ఏ. ఆనర్సు. అత్తయ్యా! వాడి ప్రారబ్ధకర్మం యిల్లావుంది గాని లేకపోతే యీసరికి ఏకాలేజి ప్రొఫెసరుగానో వుండి మూడు వందలు సంపాదిస్తూ వుండాల్సింది.'

'అదీగాక కవిత్వం రాస్తాడట. పత్రికలు చదివేవాళ్లు చక్కని కథలూ, కవిత్వమూ రాస్తాడని చెప్పుకుంటారు.'

'బొమ్మలుకూడా గీస్తాడట అత్తయ్యా! మొన్న మాపక్కింటి వారి అమ్మాయి చెప్పింది.'

౪

'లలితా? ఏం చేస్తున్నావ్?' అంటూ పక్కింటివారమ్మాయి మంజరి తలుపురెక్కలుతోసుకుని లోపలకు వచ్చింది.

'ఏం లేదమ్మా. రా. మావారిప్పుడే ఆఫీసుకెళ్లారు.' అంది మంచంపై లేచి కూర్చుని.

'లలితా? యీపేరు చదువు' అని తన చేతిలోని పుస్తకాన్ని తెరిచి మొదటిపేజీపైనున్న రచయిత నామం చూపింది.

లలితా గబగబా చదివేసింది. 'భాస్వరం రంగారావు' చదవడం పూర్తికాగానే 'ఇదేమిటీ? మా అన్నయ్య' అని ఆశ్చర్యపడ్డది.

'ఊఁ. ఇది చూడూ' అని రెండో పేజీ తిప్పింది మంజరి. ఆ పేజీపై పెద్ద పెద్ద అక్షరాలతో 'అంకితం : నా చెల్లి లలితకు' అని వున్నది. అది ఒక పద్యకావ్యం. కావ్యం పేరు 'సహోదరి'.

మంజరి ఒక్కొక్క పద్యాన్నే చదివి లలితకు వినిపిస్తోంది. లలిత అరమోడ్పు నేత్రాలతో ఆనంద తన్మయురాలై వింటోంది.

తనూ, తన సహోదరీ బాల్యంలో వనముల్లో విహరించడమూ, సెలయేరువద్ద ఆడుకోవడమూ, కోయిలవలె కూయాలని పందెం వేసుకోవడమూ, చందమామను అందుకోవాలని ప్రయత్నించడమూ మొదలుగాగలవి వర్ణింపబడి వున్నాయి ఆపద్యములలో– తనకూ, తన సహోదరికీ మధ్యనగల రక్తస్పర్శమైన వాత్సల్యవారధ వెన్నెల వెలుగులలో పొంగుతూ ప్రవహిస్తోంది ప్రతి పద్యంలోనూ. చివరి పేజీలో కవి తన సహోదరిని సంబోధిస్తూ ఒక గీతం రాశాడు. దాని అర్థం ఇది :

'చెల్లీ! నిన్ను దినమునకు ఒక తడవైనా స్మరించుకుంటాను. నీ కొంటెనవ్వులూ, చిలిపిగంతులూ– నీ ఆటలూ, పాటలూ– మొదలైన నీ బాల్యచేష్టలు నా మేధస్సులో ముద్రాంకితములై వున్నాయి. వాటిని తల్చుకున్నంతమాత్రానే నా మనసు సుందరలోకాల్లో పయనిస్తూంటుంది. రోజులు ఎప్పుడూ ఒక్కమాదిరిగా వుండవు. కాలచక్రం చిత్ర విచిత్రంగా నడుస్తూంటుంది...నీ పుట్టింటి ఆశ వదులుకోకమ్మా!'

కావ్యపఠన పూర్తికాగానే మంజరి పక్కకు తిరిగిచూసి 'ఏం లలితా? అల్లా దిగాలుపడి కూర్చున్నావేం?' అని అడిగింది.

'ఏమిటోనమ్మా...మా అన్నయ్య ఎక్కడవున్నాడో కదా! ఒక ఇల్లనీ, వాకిలనీ, భార్యనీ, ఏమీ లేకుండా నిరాధారుడై, గా

## అనుభవ సూక్తులు

నీతో నీ కష్టసుఖాలు మాటలాడేవాడే ఆదర్శప్రాయుడైన స్నేహితుడు.

* * *

నీకు దొరికే అవకాశాలకంటె ఎక్కువ అవకాశాలు కల్పించుకోవడమే జయసంపాదనకు పరమసాంప్రక్రియ.

* * *

మౌనంగా వుండేవాడు విశేషజ్ఞుడై వుంటాడనే భ్రమ చాలా మందికి వుంటుంది.

* * *

ఎద్దువంటి బలంకల మల్లుడు బుద్ధి విషయంలోకూడా ఎద్దువంటివాడే ఔతాడు.

లింకో ఎత్తుగా ఎగిరే గాలిపటానికైనా దారం అనే ఒక ఆధారం వుంటుందిగాని వాడికి ఏ ఆధారమూ లేదు. వాడు ఒక వింతవ్యక్తి. వాడిముఖం చూస్తూనే లక్ష్మీదేవి దూసుకుపోయింది, గుండెల్ని కాల్చే కష్టాలూ, జనఘోషా వాణ్ణి ఆవరించినై — ఈరోజు ఒకవూరు, రేపు మరోవూరు. ఎల్లుండి ఇంకో గ్రామం— ఈవిధంగా తిరుగుతూ 'సత్రాంభోజనం మఠాంనిద్రా' అన్న నానుడిగా జీవిస్తున్నాడుగామల్లు! అల్లా అయినా నయమే. ఒకరిని అడగడమూ, ఆశ్రయించడమూ, వారితో నమ్రతగా మాట్లాడడమూ వాడిచేతకాదు. వేళ కెవరైనా యింత అన్నం పెడితేకద్దూ, లేకపోతే లేదు అనేపద్ధతిలో వాడు. చిన్నప్పుడు ఎంత సుఖంగా పెరిగాడనుకున్నావ్? నాకు అప్పుడూ సుఖమే, ఇప్పుడూ సుఖమే—యీ ఒక్క దిగులుతప్ప. నాకు బోలెడు సంపదవుంది, నాకడుపు పండింది. చక్కని మగబిడ్డ కలిగాడు. ఇక నాకేంతక్కువ? నా పుట్టింటి పరిస్థితి ఇల్లా అధోగతి పాలయిందే అనే ఒక్కదిగులు తప్ప! నేనూ, వాడూ ఒక చోట పెరిగాం. నా పెళ్ళయినతర్వాత కూడా నాఎంగిలి తినేవాడు. వాడి మైనరు వెళ్ళేవరకూ వాడూ, నేనూ ఒక్కరకపు హోదా అనుభవించాం. అక్కణ్ణించి మాజీవితాలు భేదించిపోయినై. నా సంపదతో బాటు, నాపిల్లలతో బాటు, వాడిభార్యనీ, పిల్లల్నీ, వాడి సౌఖ్యాన్నికూడా చూసి సంతోషిద్దామనుకున్నా. కాని, భగవంతుడు చెల్లెలికి న్యాయంచేసి అన్నకు అన్యాయంచేశాడు. చెల్లెల్ని గులాబీవనంలోకి విసిరి అన్నను సలాసలా కాగే నూనెగుండిగలోకి తోసేశాడు, పుష్పాలు రెండూ మొగ్గలుగా వున్నంతవరకూ ఒకే ఆకులగుంపులో నవ్వుతూ కూర్చుండినై, విచ్చిన తరువాత ఒక పుష్పం శ్రీమంతుని పూజామందిరంలో వాలింది. యింకొక పుష్పం రోడ్డుపైన పాదాలకిందపడి నలిగిపోతోంది...... మానాన్న కోర్టు మునిసిఫ్. ఆయన కడుపునపుట్టిన నాఅన్నయ్య ఫకీర్. దేశంమీద నిరాధారంగా తిరుగుతూన్న నిరాధారుడు...ఘటన ఇల్లా వుంది కాబోలు...వాడు కనిపిస్తే చాలు మంజరీ!...నాఒంటిమీదవున్న ఈ నగలన్నీ యిచ్చేసి ఇల్లూ, వాకిలీ, సంసారమూ ఏర్పరుచుకోమని చెప్తాను. తర్వాత నాభర్తకు నేను నచ్చచెప్పుకుంటాను. ఆయనకోపం నిమిషమాత్రం...' అని చెపుతూ ఆపురుమని ఏడిచింది లలిత.

'నువ్వు ఎప్పుడూ అదేధ్యాసగా వుండి దుఃఖించకు. మీ అన్నయ్య యీవారపు ఒక లాహోరుపత్రికలో గాంధీగారి అహింసా విధానాన్నిగూర్చి ఒక వ్యాసం రాశాడు. ఆ పత్రికా కార్యాలయానికి మీ అన్నయ్య ఎడ్రెస్ తెలియపర్చమని రాస్తాను. నువు దిగులు పడకు' అని చెప్పి మంజరి వెళ్ళిపోయింది.

ఒకమాసంగడచిన తర్వాత ఒకరోజు సాయంకాలం మంజరి పకపకా నవ్వుకుంటూవచ్చి లలితతో ఇల్లాఅన్నది.

'మనం వీపువెనక వస్తువును పెట్టుకుని ఎక్కడో వెతుకున్నాం. మీఅన్నయ్య మెద్రాసులోనే వుంటున్నాడట. పూర్తి యడ్రెస్ తెలిసింది.'

లలితభర్త కుర్చీలో కూర్చుని తాంబూలం వేసుకుంటూన్నాడు.

## జాన్సన్ మంచిమాటలు

సిగ్గుపడడమనేది ఇంకా కొంచెం ఎక్కడ మిగిలివున్నదో అక్కడ సకాలంలో సుగుణమనేదికూడా లభించవచ్చు.

... ... ...

ధనము, కాలము జీవితంలో చాలా భారమైనవి. ఎవనికైతే ఆరెండూ తన అక్కరకు మీరివుంటాయో అతడు మర్త్యులందరిలోకి అసౌఖ్యవంతుడు.

... ... ...

తన్నుతాను ప్రేమించుకోవడంలో గుడ్డితనంకంటె అహంభావం ఎక్కువగా వుంటుంది. అది మన తప్పుల్ని మనకు కనిపించకుండా చేయదుకాని ఇతరులు ఆతప్పుల్ని కనుగొనలేరనే భావాన్ని మనకు కలిగించగలదు.

—*Dr. Johnson*

లలిత ఒక్కొక్క అనుకునే యీ నెలు తీసి సున్నం రాచి అతనికి అందిస్తోంది.

'మా అన్నయ్య మద్రాసులోనే వున్నాడట' అని మెల్లిగా కదల్చింది విషయం.

'ఎక్కడుంటేమాత్రం ఏం లాభం?'

'పోనీండి. ఆ లాభం మనకెందుకు కాని, ఒక్కతడవ మానం యిద్దరమూ వెళ్ళివద్దాం.'

'ఎందుకూ?—' అన్నాడు. కోరకోర లాడుతూ.

'ఎందుకా? నేను వాడితో బుట్టువుని గనక, మీరు వాడి బావగారుగనుకా...'

'బాగుంది. చాలా బాగా మాట్లాడుతున్నావే'

'నా పుట్టింటి వంశానికి వాడు ఒక్కడున్నాడు. వాడు ఎంత నీచుడేనా కానీయండి. వాడు నాసహోదరుడు—' అని కంటనీరెట్టుకుంది లలిత.

తాను ముద్దాడే ఆనున్నని చెక్కిళ్లు దుఃఖభారంచే అదురుతూండడము తమాషాగా చూచి తన హృదయంలో వుత్సాహమును రేకెత్తించే ఆసుందర నయనములు నీటితో నిండిపోవడమూ చూసేసరికి అతని హృదయమును అంటివున్న కాఠిన్యత కరిగిపోయింది.

'సరే దగ్గరేగా చంటివాడ్ని తీసుకుని నువ్వు వెళ్ళిరా.'

౬

'అమ్మగారూ? కాగితంలో రాశివున్న నెంబరుగల మేడ ఇదేనండీ' అన్నాడు జట్కావాలా బండీ ఆపుతూ.

'అయితే, అబ్బాయీ! ఒక వుపకారం చేసిపెట్టు. భాస్వరం రంగారావు అనే ఆయన ఇక్కడ వుంటున్నారా అని అడిగిరా లోపలకెళ్ళి' అంది లలిత. జట్కావాలా లోపలకు వెళ్ళి తిరిగొచ్చి 'లేరటండీ, ఆఫీసుకెళ్లారట.' అని చెప్పాడు.

'ఏ మాఫీసూ ?'

జట్కావాలా మళ్లా లోపలకు వెళ్ళి ఓ అయిదు నిముసముల్లో తిరిగివచ్చి 'లోపలకురమ్మంటున్నారండీ' అన్నాడు.

లలిత చంటిపిల్లవాడ్ని తీసుకుని బండీదిగింది. ఎదుటి గోడపై ఒక నల్లనిబల్ల దానిమీద :

'బి. రంగారావు, ఆర్టు డైరక్టర్ అండ్ జర్నలిస్టు' అనివుంది. లలిత అమితాశ్చర్యంతో లోపలకు వెళ్ళింది ముందు వరండాలో ఒక అందాల పడుచు నారింజపట్టె వేసుకున్న తనబిడ్డకి సముదాయించుకుంటూ నిలుచున్నది. లలిత వెళ్ళగానే ఆమె 'షూటింగ్ కూడా ప్రారంభించారు. భాశా ఆయన్ని చూసినా మీకు లాభం వుండదేమో?' అని అంది.

ఈ పరిస్థితులేమీ అంతుపట్టకపోతున్నప్పటికీ లలితా కొంచెం తెలివిగా ప్రశ్నించింది, చిన్నగా నవ్వుతూ 'ఏం లాభం అంటారూ?'

'కొత్తగా తీస్తూన్న 'జలజ' అనే సాంఘికఫిల్ములో ఏదైనా చిల్లర క్యారెక్టర్ కొరకు రెడ్డిగారితో సిఫార్సు చెయ్యమని అడగడానికనా మీరొచ్చింది ?'

'సిఫార్సేమిటి? జలజ ఏమిటి? అసలు యీ మేడ ఎవరిది?'

ఆయువతి సిగ్గుపడుతూ తన చంకలోని బిడ్డతో 'అబ్బాయ్ ? మీ నాన్న పేరు ఒక్కతడవ చెప్పరా?' అంది. వాడు అంత ఏడుపూ ఒక్కపట్టున మానేసి నోరు బాగా తెరిచి 'లంగారావు' అన్నాడు.

లలితకు మరీ అయోమయంగా వుంది. 'అయితే మీరెవరూ?' అని ఆమె ప్రశ్నించింది. 'నేను వీడి తల్లిని.'

'ఆలంగారావు భాస్వరం రంగారావన్నమాటేనా ?'

'అవునండీ.'

వెనకవైపునుంచి బూట్ల చప్పుడు సమీపిస్తోంది.

'అయితే, మా నాన్న అవతరించారా?' అని అంటూ ఆయువతి చంకనున్న బిడ్డను గబగబ తన చేతిలోకి తీసుకుని ముద్దెట్టుకుంటోంది.

'ఏం? చెల్లీ!' అని వెనకవైపునుంచి వాత్సల్యపూరితమైన పలకరింపు.

# మలయా సారస్వతంలోని సామెతలు

తాడులేకుండా ఉరిపోసుకోడానికి. (విడాకు ఈయకుండా విడనాడబడిన స్త్రీనిగురించి మాటలాడేటప్పుడు)

* * *

పంచదారలో నే మీకు చచ్చినచీమ కనిపిస్తుంది. (భోగానికి ఆశపడ్డమనిషి భోగాలవల్లే మరణిస్తాడనడానికి)

* * *

చీటితీసింది పగిలితీరుతుంది. (తమ సంబంధం తెంపుకోడానికి వంకకోసం చూచే ఇద్దరు మనుషుల్ని గురించి)

* * *

ఇల్లు పూర్తి అయింది. కాని ఉలి చప్పుడు ఇంకావుంది. (ఏదోవిధంగా ముగించవలసిన విషయాన్ని తిరిగి లేకెత్తించే ప్రయత్నంలో)

* * *

గుడ్లగూబ చంద్రుడికోసం నిట్టూర్పులు నిగిడించినట్లు. (పొందరాని వస్తువుకోసం ఆశపడే సందర్భాలలో)

* * *

నీటిమీద వ్రాత (వృథాప్రయాస)

* * *

కాకి తనదేశానికి తిరిగి వచ్చినట్లు (ఎల్లా వెళ్లాడో అల్లా తిరిగి రావడానికి)

* * *

క్షతగాత్రమైన పామునడక (బాగా సోమరిపోతును ఉద్దేశించి)

* * *

ఏనుగు తాను తొక్కే చీమల్ని చంపకుండా అడవిలో పెద్దరస్తా ఏర్పరచినట్లు (కొన్ని నియమాలప్రకారం నడుస్తానని చెబుతూ తన తప్పుల్ని మరిచిపోయే పెద్దమనిషినిగురించి)

* * *

శారంగును (పెద్దవస్త్రాన్ని) కాపాడుకోవడం కోసమని జాకెట్టు పారవేసుకొన్నట్లు (బహుశా రెండూ పోగొట్టుకోవడం. ఇంకో స్త్రీని పెళ్లాడడంకోసం ఉన్నభార్యను వదులుకునే పురుషుని పట్ల)

* * *

ఇంటికప్పుమీద నిప్పుచేసి పెట్టడం (ఉపకారంచేస్తూ వున్నట్లు నటిస్తూ పెద్ద అపకారంచేయడం.)

* * *

నిక్కుడుగింజ తన్ను కప్పివున్న కాయతప్పను మరిచినట్లు (కృతఘ్నత)

* * *

నాలుగు బేసి : ఐదు సరి (నమ్మరాని మాటల్ని గురించి)

* * *

పడవ ముఖభాగాన్నుండి చుక్కాని తిప్పినట్లు (ఆడపెత్తనంగల ఇంటిని గురించి మాటలాడేటప్పుడు)

* * *

బిడ్డల్ని ప్రేమించడంలో ఒక్కొక్కప్పుడు వారినిగురించి ఏడవవలసి వుంటుంది. భార్యను ప్రేమించడంలో ఒక్కొక్కప్పుడు ఆమెను విడనాడవలసి వుంటుంది.

* * *

మునిగే పడవలోని నీళ్లు అన్నీ తోడిచేయవచ్చు. కాని మనసులు విరిగాక చుట్టరికపు ఓడ మునిగితీరుతుంది.

* * *

గాయంమానుతుంది. కాని మచ్చ వుండిపోతుంది (క్షమిస్తాడు కాని మరిచిపోడు.)

* * *

పట్టపగలుకూడా వెలుగుతోన్న కాగడా పట్టుకుంటాడు (దాపరికం ఏమీ లేని నిష్కపటినిగురించి)

* * *

బతకడం కష్టంగావుంది, కాని చావడానికి ఇష్టంలేదు. (ఇతరులమీద ఆధారపడి బతికే సాపాటురాముణ్ణిగురించి)

* * *

తన ఉప్పుని ఎవడుకాని వర్షంలో పెట్టడు (తన అగౌరవాన్ని ఎవడుకాని తనంతట తాను బయటపెట్టుకోడు.)

* * *

సూర్యుణ్ణి జల్లెడతో మూయగలమా? (పెద్దతప్పు కప్పుకోవడం కష్టం అనడానికి.)

* * *

అనుభవంలో ఉపయోగిస్తే విషంకూడా ఏహానీచేయలేదు. (ద్వేషాన్ని ఎట్లా ఎదుర్కోవాలో తెలిసిన అనుభవజ్ఞులకు ఏహానీ జరగదు.

* * *

తాకట్టుపెట్టబడ్డ బల్లెంలా నిలిచి వుండటం (నిరర్థకంగా.)

* * *

మూర్ఖుడితో స్నేహంకంటె బుద్ధిమంతుడితో విరోధంమంచిది (మూర్ఖుడివల్ల

ఎప్పటికీ ఉపయోగంవుండదు. విరోధి వన బుద్ధిమంతుడు ఎప్పటికేనా మారవచ్చు.)

*　　*　　*

నడిమంతరపు సిరిగలవానివద్ద అప్పు తేవద్దు. కొత్తగా పెళ్ళిచేసుకున్న దంపతుల్ని దర్శించవద్దు. (రెండుచోట్లా నీకు ఆశాభంగం కలగడం సహజం.)

*　　*　　*

ప్రజలు గట్టిగావున్న దానిని కేవనెత్తుతారు. పడివున్న దానిని తొక్కి వేస్తారు (గెలిచేవానిపక్షం వుండాలనే బుద్ధి మానవుడికి సహజమైంది.)

*　　*　　*

నీటివాలులో స్తంభంపాతబోతే మొసళ్లు నవ్వుతాయి-

*　　*　　*

తాళంచెవి దూరంగావుంటే పెట్టికి ద్రోహబుద్ధి పుట్టవచ్చు (మగవాడు తిన్నగా వుండకపోతే వాడిభార్య వాడికి ద్రోహంచేయడం ఆశ్చర్యకరవిషయంకాదు.)

*　　*　　*

పళ్ళెంలోని నీళ్ళమీద చరిస్తే ఆ నీళ్ళు నీముఖంమీద చిందకపోవు (ఎవడి పాపం వాడ్ని కొట్టక మానదు అనడానికి)

*　　*　　*

ఒక యేటివరదపు ఒకనాటి వానతో కొట్టుకుపోతుంది (నెలల తరబడివుండే విచారం ఒక గడియ సుఖంతో పోతుందనడానికి)

*　　*　　*

నూతిమీద అలిగినవాడు దాహంతో చనిపోతాడు (ఉపయోగకరమైన వస్తువులమీద కోపగించేవాడు కష్టాలపాలవుతాడు.)

*　　*　　*

రాజుగారిమాట నీనెత్తిమీద వున్నా శంకలో నీమాటకూడా వుంచుకోవాలన్న సంగతి మరిచిపోవద్దు (రాజసేవ, దేశసేవ నీకు ముఖ్యమైనా నీవ్యవహారాలుకూడా నీవు చూసుకుంటూ వుండాలి.)

*　　*　　*

ఏచెట్టువేరు పాముకాటుకు మంచి మందో ఆచెట్టువేరుగు రాచుకుంటూ పాకినా పాముకి విషం పోదు—

*　　*　　*

బాల్చినిండా నీళ్ళువుంటే అవికొట్టుమిట్లాడి చప్పుడుచేయవు. సగానికి నీళ్లువున్న బాల్చీలోని నీళ్ళు కొట్టుమిట్లాడి సద్దు చేస్తాయి.

*　　*　　*

కోతికి పువ్వుఇస్తే ఏమిచెయ్యాలో తెలియక రేకల్ని చిదిపి నేలమీద జారవిడుస్తుంది.

*　　*　　*

తెల్ల 'పాడి'పిట్ట (మలయాలో ఒక జాతిపక్షి) ఎంతపైకి ఎగిరినా తుదకు గేదవీపుమీదే వాలుతుంది.

*　　*　　*

పెద్దపులి చచ్చినా దానిచారలు మిగులుతాయి- ఏనుగుచచ్చినా దాని ఎముకలు మిగులుతాయి- మనిషి చచ్చినా వానిపేరు వుండిపోతుంది.

*　　*　　*

డబ్బు బంగారాన్ని కొనగలదు కాని అదృష్టవంతమైన కృపాణాన్ని కొనలేదు.

*　　*　　*

పామును చంపేదాకదా అనికర్రను విరిచివేయవద్దు.

*　　*　　*

చేపనిబల్లెంతో పొడిచేటప్పుడు బల్లెం పాడుకాకుండా చూసుకో.

## సవరణ

ఆర్యా,

వందనములు

తాము పంపిన ఆంధ్రభూమి డిసెంబరు సంచిక చేరినది. కృతజ్ఞుడను. అందులో వ్రాయబడిన సంపాదకీయసమాలోచనయందు నేను 'గ్రామోద్ధరణ ప్రచారకమండలికి' పదివేల రూపాయలిచ్చియున్నట్లు చదువరులకు దోచవచ్చును. ఆ రేండ్లక్రిందట శ్రీగోటేటి వెంకటశివరావు స్మారకనిధిగా నేర్పాటుచేసినదిగాక మరల నే నేమియునీయలేదు. గ్రామోద్ధరణ ప్రచారకమండలియనన దెద్దియు నున్నట్లుగూడ నాకు తెలియదు. కాన తెలియజేయుచున్నాను. అవసరమగు సవరణను ప్రకటింప గోరుచున్నాను.

చిత్తగింపగోరెడు

కొండెవరం, తూర్పుగోదావరి. 2-12-41.

గో. జోగిరాజు.

---

*　　*　　*

ఏలిక పాములకోసం భూమి తవ్వాలా ?

*　　*　　*

చచ్చిపోవలసివస్తే ఒక పెద్ద మొసలి నోట్లోపడడం మంచిది కాని చిన్నచేపల చేత చితకపొడవబడడం మంచిదికాదు.

*　　*　　*

వెండి బంగారాల్ని వర్షించే పరదేశంకంటె కత్తులు కటార్లు వర్షించే స్వదేశం మేలు.

*　　*　　*

ఎవడి మంచంమీద వాడు మహారాజు.

# ఈ యుద్ధంలో ఇసుక

## ఈనాడు ఇసుక ఉపాస్యదైవం

ఒకవిధంగా ఇది ఇసుకయుగం అనికూడా అనవచ్చు.

తెనుగువారు ఈసడించే వస్తువుల్లో ఇసుక ఒకటి.

'ఇసుక తక్కెడను పేడతక్కెడ' అనే తెలుగు సామెతవల్లనే ఇసుకను తెనుగువారు ఎంత నిర్లక్ష్యభావంతో చూస్తారో తేలిపోతుంది.

వారు ఎందుకూ పనికిరాని భూమిని ఇసుకపఱ్ఱ అంటారు; కిట్టనివాడి పాలంలో ఇసుకమేట వేసుకుపోవాలంటారు; శాశ్వతంగా వుండనివాటిని ఇసుకతో కట్టిన ఇళ్ళని తోసివేస్తారు; చేయరానిపనిని ఇసుకలో తైలంతీసినట్లని తిరస్కరిస్తారు.

ఇంతేకాదు ఇసుక పదాన్ని వైచ్యానుసంధానంకోసం ఇతర పదాలతో కూడా కలిపి వాడడం తెలుగువారి అలవాటులలో ఒకటి.

కొన్ని నిదర్శనాలు చూపెడతాను.

పాతఱ శబ్దానికి నిధి అని అర్థం. కాని దానికి ఇసుకచేర్చి ఇసుక పాతఱ అంటే అంతుపట్టని, అర్థంకాని విషయానికి మరోపేరుగ వుపయుక్తమంటుంది.

తిన్నెకుకాని, దిబ్బకుకాని వెనక ఇసుకచేర్చి ఇసుకతిన్నె అనీ, ఇసుకదిబ్బ అనీ అంటే అసలు వస్తువుల అధికృత తగ్గుతుంది కాని ఎక్కువకాదు.

ఇసుకశబ్దంతో సంబంధం వుండడం మూలాన్ని ఇసుకదాసరికూర అనే పేరుగల ఆకుకూరకాని, ఇసుకదొంతు అనే పేరుగల చేపకాని, ఇసుకబేలు అనే పేరుగల తీగకాని, ఇసుకమాను అనే పేరుగల చెట్టుకాని తెనుగుదేశంలో వైశిష్ట్యాన్ని సంపాదించలేకపోయాయి.

వీటి అన్నిటినిపట్టి తెలుగువారికి ఇసుకమీద ఇసుమంతేనా గౌరవంలేదని తేలుతూవుంది.

అసలు ఆంధ్రభాషలో అల్పాదల్పాన్ని తెల్పడానికి ఇసుమంత అనేదిపర్యాయపదమైవుంది.

తెలుగువారిచేత ఇంతగా, ఇన్ని విధాల ఈసడింపబడుతూవున్న ఇసుక నిజంగా నిష్ప్రయోజనమైనదా ?

కాదు.

ఉపయోగకరమైన అనేక వస్తువుల్ని ఈసడిస్తూ వున్నట్లే తెనుగువారు ఇసుకనుకూడా ఈసడిస్తూ వున్నారు.

ఇసుక ఉపయోగాలు అనంతమైనవి.

కాంక్రీటుకు ఇసుక అవసరం. సిమెంటుకూ, సున్నానికి ఇసుకకలిస్తే కాని రాణింపులేదు. మట్టిగోడలూ పెట్టే బెండడికీ ఇసుక అవసరంవుంది. పునాదుల్లో ఇసుకపోస్తారు. బిస్కట్లు వంట సమయంలోనూ; వేరుశనగ కాయల, మొరమొరాల వేపుడు సమయంలోనూ ఇసుక కావలసి వుంటుంది. కాలాన్ని కొలవడానికి ఇసుక ఉపయోగిస్తారు. అద్దాలు చేయడానికి ఇసుక కావాలి.

అయితే ఇవి అన్నీ శాంతి సమయ సంబంధమైన ఉపయోగాలు.

ఇసుకకు యుద్ధకాల సంబంధమైన ఉపయోగాలున్నూ వున్నాయి.

అసలు ఇప్పటి యుద్ధం కొన్ని ప్రాంతాలలో కేవలం ఇసుకకోసమే జరుగుతూవుందని చెప్పవచ్చు.

ప్రస్తుత యుద్ధప్రదేశాలలో ఒకటైన లిబియా అంతా ఇసుకమైదానంకదా. ఆ ఇసుకమైదానంకోసం ఇప్పుడు ఎంతటి దారుణయుద్ధం జరుగుతూవుందో వూహించండి.

ఇసుకమైదానంకోసం యుద్ధం జరుగుతూవుండడంచేత ఇసుక యుద్ధం అంటే చవిచూసుకుంటుందని ఊహించకూడదు.

ఈ యుద్ధాన్ని ఆపడానికి- ఆపడానికి వీలులేకపోతే దాని తీవ్రత తగ్గించడానికి ఇప్పుడు ఇసుక కంకణం కట్టుకుంది.

లిబియాలో యుద్ధగమనాన్ని ఇసుక చాలాసార్లు అరికడుతూవచ్చింది. ఇసుకదుమారాలు లేగి యుద్ధగమనం ఆగిపోయిందంటూ లిబియానుంచి రూటరు సంజయుడు అప్పుడప్పుడు వార్తలు తెస్తూ వుండేవాడు.

ఇసుకదుమారం ఎట్లావుంటుందో కిందివర్ణన కొంతకు కొంత వివరిస్తుంది.

# కామదానకర్త్రి

'శృంగార సంగ్రామం అనుభవనీయమేనా ?
వీక్షణనీయము కూడానా ?'

రచయిత:

## వి. లింగమూర్తి

ఆమె ఒక మహారాజు ముద్దుతనయ. సౌందర్యరాశి. విద్యావతి. ఒక స్వాతంత్ర్య దేశాధీశుని యిల్లాలు. కాని 'అంచుకి తొగురు తక్కువన్నట్టు' మంగళసూత్రధారణయిన మరుక్షణంలో మరణించేడు పతి. ఆమె యిప్పుడు విగతపతి. లోకానికి విధవరాలు.

పుట్టినింటివారిచ్చిన సిరులు, మెట్టినింటివారి రాజ్యము ఆమెకే చెందేయి. మహారాజ్ఞి ఐంది. రాజ్యమెందుకూ, ఆమెకు? దగ్గర వారసులకు కబురుచేసి ధారాదత్తంచేసింది రాజ్యమంతా. పుట్టింటే కాలంగడప నిశ్చయించుకుంది. చిన్నప్పట్నించి ఆమహావ్యక్తిని పెంచిందొక దాది. యింకా కంటిరెప్పలా చూస్తూవుంది. ఆమె తల్లిదండ్రుల దుఃఖము కన్నా దాదిదుఃఖ మధికమైంది.

ఒకనాడు తైలాభ్యంగనస్నానంచేస్తున్నాది ఆమె. దాది దగ్గిరే నిల్చుని సపర్యలు చేస్తున్నాది. నిర్వీర్యుల్ని కూడా వీర్యవంతులుగాచేసే ఆమె అంగసౌష్ఠవం, అనంగరంగడ్ని భ్రమింపచేసే ఆమె అందం దాది దుఃఖాన్ని రెట్టించేయి. దాది కన్నీటి బొట్టొకటి ఆమెపై బడ్డాది. ఆమె తీక్షణవీక్షణాలతో ప్రశ్నించింది కారణమేమిటని. కారణం దాచలేదు దాది. ఆమె సౌందర్యము, యౌవనము అడవిగాచిన వెన్నెలలా- బూడిదలో పోసిన పన్నీరులా వ్యర్థమయినందుకు విచారిస్తున్నట్టు తెలియజేసింది.

'అది గతజలసేతుబంధనముకదూ'

'అవును తల్లీ'

'ఈదేహము పునరార్పితము చేయరాదు. కా...'

'కాని ఏమి తల్లీ'

'శృంగార సంగ్రామం అనుభవనీయమేనా, వీక్షణనీయముకూడనా'

'అమాయకురాలవు.'

... ... ... ...

ఏలినవారు కబురుపంపిన తాబేదారు రాముడు వచ్చేడని మనవి అన్నాది పరిచారిక.

'రాముడూ'

'చిత్తం ఏలినవారు కటాక్షించాల.'

'నీవయస్సెంతరా ?'

'నాకు తెల్దుకానండి మహాప్రభో పెద్దబగాది * బాగా జ్ఞాపకముందండి.'

'పాతికే వుంటాయన్నమాట'

'చిత్తం ఏలినోరికే తెలియాలి'

'ఇవాళ్నుంచి నువ్వు సింహద్వారం వద్ద కాకుండా ఆ ఎదురుగుండా గదిలో వుంటూవుండు. నీకేదియిష్టమో అది వంటవారితో చెప్పి చేయించుకో. జనానా సుమా జాగ్రత్తగా వుండాలి.'

'నానేం తప్పుచేసేను? అమ్మా! క్షమించాల ఒంటిగాడ్ని.'

'అవున్రా. నీవిషయం కనుక్కున్నాను. నువ్వు తప్పు చెయ్యలేదులే. పో'

రాముడు వెళ్ళిపోయాడు అది అదృష్టమో, దురదృష్టమో కూడా విచక్షణ చేయలేని మనస్సుతో. చక్కనైన భోజనం, సౌఖ్యమైన నివాసం, యౌవన సుందరాంగులతో నిండిన వాతావరణం రాముడి మనస్సులో యౌవనోత్సాహాన్ని వుద్రేకింపచేసేయి. తన ప్రభ్వీదగ్గిరకు పోయాడు. తానక్కడ వుండడం కష్టసాధ్యమని మనవిచేసుకున్నాడు: చేసుకో లేక, చేసుకోలేక.

ఆమె గుర్తించింది రాముడి మనస్థితి. చిరునవ్వుతో చెప్పింది యింక రెండు రోజులుండాలని. కాలాన్ని నిందించుకుంటూ కదలి వెళ్ళేడు రాముడు.

అందానికి, అంగ సౌష్ఠానికి పేరెన్నికగన్న వెలయాలికి కబురుపంపిం

* విశాఖపట్టణ మండలవాసులు పెద్దగాలివానకు పర్యాయపదంగా దీనిని వాడతారు.

దామె ఆనాటి మధ్యాహ్నం.

'నీవు ధనంతో కేకదూ నిమిత్తం?' అని ప్రశ్నించింది వెలయాల్ని. ఆమె.

'కులధర్మ మంతే' అని జవాబు చెప్పింది గణిక.

'రెండురోజులు మా రాముడ్ని శృంగారక్రీడాభిరాముడ్ని చెయ్యాలి. మంచి యౌవనవంతుడు కూడా, నీవు కోరినంత ధనమిస్తాను.' అంటూ ఆజ్ఞాపించింది ఆమె.

... ... ...

ఆరాత్రి రాముడి శయనాగారము శృంగార సంగ్రామ రంగస్థలంగ మార్చబడ్డాది. దేదీప్యమానంగా దీపాలు పెట్టేరు. తన్నుతా నమ్మలేకుండా వున్నాడు రాముడు. ఆమెత్తని పరుపుపై శరీరం వాల్చేడు.

ఓరగిల వేసిన తలుపు తోసుకు వచ్చింది వెలయాలు. కలో, భ్రమో అనుకున్నాడు. కాని తన సరసనే చేరుకుందాసాని. కలలో మాత్రమా సౌఖ్యమెందు కనుభవించరాదని చేతులుచాచి ఆహ్వానించేడు. అప్పుడే ఆసరసశృంగార సుధా సముద్రానికి, యువతుల ప్రపంచానికికూడా సంపూర్ణచంద్రోదయమైంది. కర్ణాకర్ణిగా అడుగుల చప్పుడు వినబడ్డాయి యిద్దరికి. కాని సంగ్రామనిమగ్నులకు అన్యశబ్దాలతో నిమిత్తంలేదుకదూ. వర్ణనాతీతంగావుంది వారి ఆనందం.

కొంతదూరంలో మెత్తని కుర్చీలో కూర్చుని చూస్తున్నాదిఆమె. ఆకామదీక్షాకర్త్రి ఆమె. వాళ్లుకూడా చూచిచూడనట్టూరకున్నారు. ఆమె నయనాలతో కొంతతడ వానందించి వెళ్ళి పడుకుంది.

మర్నాడుదయం దాదితో చెప్పింది శృంగార సంగ్రామం వీక్షణీయము కూడానని.

నాడుమొదలు ఆమెయిట్టాంటి కామదాన మెందరెందరితో చేస్తూవుండేది. ప్రతిదినం ఆమె వీక్షిస్తూవుండేది. అంతటితో తృప్తిపడేది. వింత తృప్తి, వింత ఆనందం.

[ఇది ఒక సంస్థానాధిపతి యింట్లో జరిగిన యథార్థవిషయం.]

# డొక్కా సీతమ్మ

[తూర్పు గోదావరిజిల్లా రాజోలు తాలూకా లంకల గన్నవరంలో ఈమె నిరతాన్నప్రదాత్రిగా వుండినది. ఈ రేడియో నాటక కారుడికి ఈమె భర్త నామము జోగయ్య అనే విషయంకూడా తెలియనట్లుంది. ఈమె మరణించి ఇప్పటికి ముప్ఫయి లేక నలభై ఏళ్లు కావచ్చు. ఈమె అన్నదాననిరతిని గురించి గోదావరి జిల్లాలలో ఇప్పటికిని అనేకకథలు విశేషప్రచారంలో వున్నాయి. —సంపాదకుడు.]

—బైరాగులు దోవవెంట పోతూ—

(గేయం)

ఎన్ని దానాలైన అన్నదానంబోన
ఇన్నినిష్ఠలు, జపా లెందుకో గురుడ!
పట్టెడన్నముపెట్టి బ్రతికించు సీతమ్మ
అట్టి తల్లికి సాటి యగువార రురుడో.
రాజులంతా పోతరాజులా తింటారు
రోజంతసాధులూ రోదింత్రు గురుడా
డొక్కవారిలా వన్నెకెక్కినా సీతమ్మ
ఒక్కతే మనకెల్ల—దిక్కురా గురుడో.

బంట్రోతు—తాణేదారుగారు పేర్రాజుగారు దొరగారి శలవైంది.

పేర్రా—శలవైందా, ఇదుగో యిప్పుడే వస్తున్నానని మనవి చెయ్యి.

... ... ...

జమీం—పేర్రాజుగారు, ఏమిటండి ఆ గోసాయిలు పాడుతారు, ఎవరండీ, ఆసీతమ్మగారు. మా గొప్పగా పాడేస్తున్నారు. సత్రాలు, సావిళ్లు కట్టించిన వాళ్లం, దొరలం మేమంతా ఊరికెనే పోయినాంగాని ఈ సీతమ్మగారో కావిడ వచ్చింది గొప్ప అన్నదానంచేసేదని పొగడటానికి?

పేర్రా—చిత్తం—అదే విధి? అదుగో, అదుగో ఆ వీధిలో భట్రాజు ఒకడు వెళుతున్నాడు. శలవైతే పిలుస్తాను. డొక్క సీతమ్మగారిమీద పద్యం చదువు అనండి.

జమీం—పిలు, పిలు, విందాం.

పేర్రా—అదుగో వస్తున్నాడండి.

భట్రాజు—చిత్తం, ప్రభువులు, మహారాజులు- అర్థిజనకుముద బాంధవా, ఆశ్రితవిద్వజ్జనాధారా! రాయనమంత్రిభాస్కరా...

జమీ—ఆగవోయ్, ఆగు...

భట్రా—చిత్తం...

జమీ—ఆ డొక్కా సీతమ్మగారిమీద ఏదో పద్యముందిట—ఏదీ చదువు... నువ్వే వ్రాశావా?

భట్రా—చిత్తం మహాప్రభో!—(రాగంవలె మూలిగి)

కం. డొక్కా సీతమ యంటె [ గా
నిక్కము గా అన్నపూర్ణనిజమురయం
ఎక్కడి దధి, ఘృత, సూపము [మా
లెక్కడిభక్ష్యాలు చెప్ప నెవ్వరి తర

జమీం—ఇతనికేదన్నా యిచ్చి పంపించమని కచ్చేరీలో చెప్పు.

భట్రా—మాప్రభో, యింకా ఈ తల్లి కథలు చాల వున్నయండి, ఒకానొకనాడు—

జమీం—పేర్రాజూ! వెళ్ళమని చెప్పు.

పేర్రా—(నెమ్మదిగా) వెళ్లు, వెళ్లు, —దొరగారి శలవైంది.

జమీం—ఏమిటో వేలం వెర్రి.

పేర్రా—చిత్తం, తమరు అలా శలవిస్తే—ఏం చెపుతాను? నేనూ చాలామందిని చూస్తున్నాను. డొక్కా సీతమ్మగారున్నారేం డి, ఆ మహాతల్లి అన్నపూర్ణాదేవే అంటారు. ఓరాత్రిలేదు, పగల్లేదు, అతిథి, అభ్యాగతీ ఎవరు వెళ్ళినాసరే, ఆప్తబంధువుల్లాగు చూసుకొని, షడ్రసోపేతంగా, మృష్టాన్నం పెడుతుంది.

జమీ—అసలు, నీవు కాస్త వుంటె గంపంత చేస్తావు.

పేరా—కాదు, ప్రభూ! తాము నిజం చిత్తగిస్తే—

జమీ—పోవయ్యా, ఎప్పుడన్నా, ఎవరన్నా వస్తే, పట్టెడన్నం పెడుతుందేమో. అసలు బ్రాహ్మణులూ, చూశావూ, తినటానికి పారేయ్యటానికి సరిపోయేట్టు వండుకుంటారటలే, ఆ వేళకు ఎవరన్నా వస్తే పారవెయ్యకుండా, వచ్చినవాండ్లకు పెట్టిందేమో... అంతమాత్రం చాత...

పేరా—స్వయంగా నేను చూశాను, చిత్తం...

జమీ—నీవు వెళ్ళినప్పుడు ఏదో పండుగై వుంటుంది, బాగా మేపిందేమో! ఓః నువ్వు ఆమెను తీసుకువెళ్ళి నక్షత్రాల్లో నడిపిస్తున్నావు.

పేరా—తమదాకా ఆ ప్రశంస రాలేదుగాని, ఎప్పుడూ, ఈ ర్కా సీతమ్మగారంటె చాలా ప్రశస్తి, చిత్తం. మొదట వాళ్ళది మంచి సంసారమే. ముప్పై ఎకరాలు గోదావరి కాలవ క్రింద సుక్షేత్రమైన మాగాణీ, రెండు కొబ్బరి తోటలు, మన ఎస్టేటులో వూరే అది. తమరు ఎప్పుడూ దయచేయలేదు అవూరు.

జమీ—ఒక్క బ్రాహ్మలకేనా, పేరాజు?

పేరా—అలా కాదండి, ఎవరైనా సరె. ఈకులం, ఆకులం అని విచక్షణేలేదు అతల్లికి, శూద్రుడై వచ్చాడంటె సరి, అన్నం పెట్టేదాకా ఆమె ప్రాణం నిలవదంటె నమ్మండి. అదేవిటో ...... కేవలం ఇందుకే వాళ్ల ఆస్తి, ఆ కొబ్బరితోటలూ, అన్నీ అప్పులకింద అమ్ముకున్నారు. ఇప్పుడు చాలా బాధ పడిపోతున్నారు పాపం, ఇంట్లో —అయితేమాత్రం, నాస్తి వున్నదా, హరిహరీ మాంగల్యాన్ని కుదువబెట్టయినా సరె ఆ వచ్చినవారి ఆకలిమంట చల్లారుస్తుంది గాని ఆతల్లి—జగన్మాత.

జమీం—నువ్వింతగా చెపుతూంటె నిజమేమో అనిపిస్తూంది. ఐనా పరీక్షించి చూస్తేగాని నేను నమ్మను. వాళ్ళకేం దొరతనా లున్నాయంటావా?

పేరా—చిత్తం, చిత్తం. ఏదో పరువుకోసం, నలుగురు ఓహో అని పొగడటంకోసం చేసే మనిషైతే పరీక్షిస్తే పడిపోతుంది. ఆమెకేం— ఆమెది మాతృహృదయం. ఆకలి అమ్మా, అని వింటె ఆమె ప్రాణం, కోసుకుపోదూ?

జమీం—సరేగాని, యిలా యిల్లంతా గుల్లచేస్తుంటె ఆమె భర్త చూస్తూ ఊరుకుంటున్నాడూ?

పేరా—ఆయన అంతవాడు కాదులెండి. తెలివి కలవాడే— ఏంచేస్తాడు! భార్య చేసేది సత్కార్యం.

జమీం— ఏం భార్య — ఏం సత్కార్యం— కొంప కొల్లుపోలా? ఇప్పుడేం చేస్తారూ.

పేరా—ఆమె కా దిగులు లేదండి. అంతా పరమేశ్వరుడే యిస్తాడు, ఇదేం నాయింట్లో పూ? అని ఆమె ఎప్పుడూ మహారాజపన్నికున్నంత సంతృప్తితో వుంటుంది.

జమీం—ఇదెంతవరకు నిజమో, నేను బాగా విచారించుకోని గాని చెప్పను. నిజమే ఐతేమాత్రం పాపం సర్వం కోల్పోయినవాళ్ళకి, ఒక వూరు వ్రాసి యిచ్చి నిరతాన్నదానం చేసే ఏర్పాటు చేస్తాను.

పేరా—చిత్తం. ప్రభువు తలుచుకుంటే ఏం కొదవ?

---

[సీతమ్మగారు, ఆమె భర్త—రాత్రి ౯ గంటలు. వంటిల్లు సర్దుకుంటున్నట్టు చెంబులు, పీటలు చప్పుడు. తలుపు వేసింది.]

భర్త—ఇదుగో

సీత—...

భర్త—అమ్మీ...

సీత—ఏవిటి?

భర్త—అన్నం తినకుండా నేవచ్చావా, చివరికి? ఎందుకు తింటావు- మొదటినుంచి ఇదేగా మనకు, నే నౌనంటే నీవు కాదంటూ వుండడం.

సీత—పోనీ లెద్దురూ, ... ఒక్క నాటికేం ప్రాణాలుపోతాయాఁ?

భర్త—అది కాదు, ఉండగా తినకపోవటమెందుకుఁ అని.

సీత— ఎవరన్నా, అపరాత్రివేళ వస్తారనుకోండి. వస్తే, అప్పుడేం చేస్తారు? జోరున ఈ ముసురు వొకటి. ఈ దరలో, మీరు పెద్దవారు, ఎక్కడికి వెళుతారు, ఎవరిస్తారు, చెప్పండి!

భర్త—ఈ రాత్రి ఎవడొస్తాడే తలకుమాసినవాడు. మనం మహాసత్రం పెట్టామని.

సీత—అలాకాదు. పరీక్షగా తటస్థపడుతారు. ఇలాంటప్పుడే, మనమేం లోకాన్నుద్ధరిస్తున్నామా? పట్టెడు మెతుకులు, అంతేగా.

భర్త—అల్లాగే వుంటుంది మొదట్లో, ఒక్క సెంటు భూమి కూడా లేకుండా అంతా అప్పుల వాళ్లు కట్టుకొని పోయినారా? చూస్తూ వుండగా మనమేం చేశామని పెళ్లిళ్లా, ప్రస్తావాలా? అంతా ఈ భోజనాల కిందేగా అంతరించిపోయింది, తోటలూ, దొడ్లూ, సర్వమూ—ఇహ కొంప ఒకటి మిగిలివుంది, సూర్యచంద్రాదులూ మనం కలిసి కాపరం చెయ్యటానికి.

సీత—మనం యివన్నీ వచ్చేటప్పుడు మూటగట్టుకు తెచ్చాము టండి, పోయేనాడూ అంతే, ఒక్కటీ వెంటరాదు. ఏదో ఆ భగవంతుడే ఇస్తూ ఉంటాడు ఆ వేళకి.

భర్త—మనింటికి వచ్చేవాళ్ళకు మాత్రం ఆ భగవంతుడు లేడూ— ఆడవాళ్ళకి పట్టిందా ఒక్కటే వేదాంతం – లేదా, అరిచి చచ్చినా చేయి విదల్చరు

కాకికైనా. అంత కేవలం వేదాంతంలో కూచుంటె జరుగుతుందా? యీ కాలంలో, సరేగాని, లోపలికి వెళ్ళి నాలుగు మెతుకులు తింటు మరేం పొద్దు పోలేదు.

సీత—వద్దులెండి, పడుకోండి.

భర్త—అంటె, తినవన్నమాట. తెల్లవారితే, ఏదో అఘోరించి, ఎవడి కాళ్ళయినా పట్టుకుని– చివరకీ కొంప ఒకటేగా మిగిలింది. దీన్నికూడా తాకట్టుపెట్టి, కావలసిన దధిఘృత పాయసాలు, బండ్లకెత్తించుకుని వస్తాను. సరేనా? నీవు స్వర్గానికి పోతానంటె, నేనేనా అంత పాపిష్ఠి పరమున్యాని.

సీత—నామాట వినండి. ఏదో ఎవరి పిచ్చి వారి కానందం, మీరు వెళ్ళి పడుకోండి, నాకేం ఫరవా లేదు.

భర్త—నీ ఖర్మం...అనుభవించు.

సీత—ఈయన పడుకున్నారు. ఆ పరమేశ్వరుడే యిస్తాడనే నమ్మకం కుదరక, ఊరికే ఆందోళన పడతారు ఈయన. చేసేదేముంది? ఔను, తెచ్చే మగవాళ్ళ బాధ అంతేనేమో ... ...రామచంద్రప్రభూ! రక్షకా! నీదయ. మంది అనేదంతా సమర్పించుకున్నాం, అతిథిని పంపించేవాడివి, ఆహారమందించేవాడివి అంతా నీవేకదా ...–(ఆవలించి నిద్రిస్తుంది)–

---

(గోవిందనామాల పాట)

ఆరామలక్ష్మణులు గోవిందారామ,
అడవిల్లో కేగిరి గోవిందా
సీతమ్మ తల్లితో గోవిందారామ-
చిత్రకూటమువద్ద గోవిందా
పర్ణశాలను గట్టి గోవిందారామ
బాగుగా నుండిరి గోవిందా ॥

[రాత్రి వానకు గోదావరీ ప్రవాహపు నీటి కరుళ్లు ఒడ్డులకు తగిలేశబ్దం, రుయి మనే యీదరగాలి సీతమ్మగారి యింటితలుపులు ఊపుతూంది.]

సీత—నిద్ర పట్టలా. పాపం- ఏమండోయి!—నిద్రపోతున్నారా?

భర్త—అబ్బా, ఏమిటే...

సీత—వినండి ఏమిటీ చప్పుడు?

భర్త—గాలికేమో, తలుపులు కొట్టుకుని వుంటయి.

[హోరు గాలి వినపడుతుంది.]

అబ్బా, కిటికీ మూసేయి, వాన జల్లు లోపలికి కొట్టుతూంది, అమ్మయ్యో ఏం వురుములు, ఏం మెరుపులు.

సీత—

రామనామ తారకం జానకీమనోహరం
భక్తిముక్తి దాయకం సర్వలోకరక్షకం

భర్త—పడుకోవే, నీభక్తి బంగారంగాను. రెండు ఘంటలైంది, కూచున్నావు శివశక్తిలాగు.

సీత—ఏమిటీ పడక, హోరుగాలిలో నిద్ద రేం పడుతుంది!

—దూరాన్నుంచి, సీతమ్మగారూ, ఆకలేస్తూంది, అన్నం పెట్టిండి సీతమ్మగారోయ్.—

సీత—ఏమండోయ్ లెండి, ఎవరికో ఆకలి వేస్తున్నదట పాపం.

భర్త—చాలు చాల్లే ఊరుకో, ఏమాలవాడో, మాదిగ వెధవో. అర్ధరాత్రి ఆకలేస్తే రోకలి మింగమన్నారు.

సీత—అల్లా కాదండీ, ఎంత ఆకలేసిందో అర్ధరాత్రివేళ, నేను చెప్పలా యిలాగే ఎవరైనా వస్తారని. నేను తినేస్తే, యేమయ్యేదో సుమండీ.

గోదావరి అవతల ఒడ్డునున్నవమ్మో తల్లీ.

సీత—ఆగండి... అదుగో గోదావరి అవతల ఒడ్డునున్నాట్టండి. ఆ పక్షుకు మెతుకులు పెట్టి వస్తానండి.

భర్త—నీకేం మతి గితీ పోయిందా. అర్ధరాత్రి. తాడిపోత వర్షం, గాలి హోరుమంటోంది. ఇప్పుడు గోదావరి దాటి వాడికి అన్నం పెట్టి వస్తావు, మహా బాగా వుంది.

—ప్రాణాలు పోతున్నయి తల్లీ—
సీతమ్మతల్లీ—ఆకలేస్తుందమ్మా—

సీత—అయ్యయ్యయ్యో నాప్రాణం వూరుకోలేదండీ. ఎంత ఆకలేస్తుందో అదుగో వర్షం వెలిసింది. నేను వెళ్ళి పెట్టివస్తాను.

భర్త—వెళ్ళబోకే అఘాయిత్యం. పాడుబడ. తెల్లవారే లోపల చచ్చిపోళ్ళే వే.

సీత—అట్లా కాదండి. ఆ కేకలో ఎంత దీనత్వం, ఎంత బాధ

వినిపిస్తూందండి. వెళ్ళకపోతే నాచేతిమీదుగా అతని ప్రాణం తీసినదాన్నౌతాను.

భర్త—ఏం, పోతే, పోతాడు - భూమికి వెలితా?

సీత—అబ్బా, ఎంత మాటన్నారు, ఊరుకోండి, అవాచ్యం.

భర్త—అదెందు కూరుకుంటుంది. మాట్లాడుతూనే వుంది. అప్పుడే మాటగట్టింది అన్నం. అర్థరాత్రి పురుగుబుట్ర వుంటాయి కూడా.

సీత—నన్నిహ మాట్లాడించబోకండి, ఆమనిషికి అన్నం పెట్టేవరకూ నామతి మతిలో వుండదు.

భర్త— వెడుతున్నావు - అమ్మయ్యో, అమ్మయ్యో, మళ్ళీ వాన మూసుకువస్తున్నది. గొడుగైనా తెస్తానుండవే. నిన్నే నేవ్ - లాంతరట్టుకొస్తున్నానుండూ ఏమేవ్, వస్తున్నా ...వినిపించుకోదేం... అయ్యయ్యో సందు మలుపు తిరిగింది ...ఇదుగో నే, లాంతరూ గొడుగూనూ- అయ్యయ్యో ఎంత చీకటి...కన్ను పొడుచుకున్నా కనపట్టంలేదు. గోదావరి గట్టు నిండా త్రాచుపాములు...ఎవరయ్యా మీరు. ఇలా రండి కొంచెం. తాణేదారుగారా, బాబు. కాస్త తోడు రండి. మాయింటావిడ అల్లా వెళ్ళిపోతూందండి.

పేర్రా—కర్ర చేతులో వుందా, పాములుంటాయి.

భర్త—అదుగదుగదుగో, చూశారు. ఆ గోదావరి ఒడ్డు, ఆతుమ్మచెట్లల్లో కదుల్తూ వుంది. చూడండి, వెళ్లాం, తొందరగా వెళ్దాం, పేర్రాజుబాబు, ఆ మనిషి చెపితే వినదు, ఎవడికో ఆకలేసిందిట. అమట్టున లేచి పరుగెత్తుతూందండి.

పేర్రా—ఏదేవిటండి, గోదావరిలో దిగబోతున్నారుకూడాను. ఎంత మహాతల్లండి సీతమ్మగారు.

భర్త—పేర్రాజుబాబూ, అది మొసళ్ళ గుండం కూడానూ. మాయింటిది ఇహ నాకు దక్కదు. ఈ అర్థరాత్రి గోదావరి ఈదుకువెళ్ళి ఆ మాలవాడికి అన్నం పెట్టకపోతే యేం మునిగిపోయింది బాబు- (ఏడుస్తూ)-

పేర్రా—ఉండవయ్యా పిచ్చిబ్రాహ్మడా, ఆ సీతమ్మతల్లి కడుపు చల్లగాను. ఎంతమంది ప్రాణాలు రక్షించిందో.

భర్త—ఏమేవ్, బాబోయ్, బాబోయ్ ఆగుండంవేపే వెళ్లుతూందండి, సుడిగుండం అక్కడ తాడిలోతు బాబూ.

పేర్రా—ఓ సీతమ్మగారూ.

భర్త—ఏమేవ్, ఆ పక్కకు వెళ్లబోకు, మొసళ్లు, మొసళ్లుంటాయి. (చప్పట్లు చరుస్తాడు) పేర్రాజుబాబూ! అదుగో మునుగుతోందండి.

పేర్రా—పరోపకారం కోసం ప్రాణాలర్పిస్తోంది మహాతల్లి.

భర్త—పరోపకారమేమిటయ్యా, నా కాపరం బండలై పోయింది. అయ్యయ్యయ్యో.

పేర్రా—అదుగోనయ్యా తేలింది, పోయినకొద్దీ గోదావరి నడుములోతే వుంటుంది ఆమెకు, ఆహా...

భర్త—బాబూ, తేలిందా బాబూ, నా సంసారం తేల్చిందన్న మాటే-

పేర్రా—ఆహాహా, ఆ శ్రీకృష్ణ పరమాత్మవారిని, వసుదేవుల వారు తీసుకుపోతూంటే యమునాదేవి ఇలాగే యిచ్చిందిట దారి. చూడవయ్యా వెర్రిబ్రాహ్మడా మహా పతివ్రత, పరమ భక్తురాలు.

భర్త—అదుగో బాబు వడ్డెక్కినట్టుందే. ఆ, అది గట్టెక్కితే, మాకష్టాలు గట్టెక్కినట్టే.



[గోదావరి ఒడ్డున చింతచెట్టుకింద ఒక మనిషి మూలుగుతూ ఉంటాడు-]

సీత—ఎక్కడ నాయినా! నా ఖర్మం కాలి కంటికి కొంచెం మసకలు కూడాను. యిక్కడేనా, తండ్రీ!

వ్యక్తి—(మూలుగుతూ) అమ్మా, సీత...మ్మ...తల్లీ, ఇంకా రాలేదా తల్లీ, ఆకలితో చివరకు

చావాలసి వచ్చింది అమ్మా.

సీత—ఇదుగో వచ్చా నాయనా! నాతండ్రీ! వచ్చా. పులుసైపోయింది. కొంచెం గోంగూర పచ్చడి, అన్నమూ, పెరుగు చుక్క పట్టుకొచ్చా.

వ్యక్తి—ఊఁ...ఊఁ... ఏద్దె నా సగే తల్లీ!...ప్రాణాలు తక్కుతే...

సీత—ఆ దిక్కుమాలిన గొల్లది నెయ్యి పట్టుకురమ్మంటే పట్టుకొచ్చిందే కాదు. నెయ్యి లేదు బాబు. ఎలా తింటావో ఏమో, ఇంటిదగ్గరైతే కాసిని పాల చుక్క పోద్దును.

వ్యక్తి—దగ్గరకు రాకు తల్లీ, ఆ మాట అక్కడ పెట్టమ్మా, నేను మాలవాణ్ణి.

సీత—ఆకలికి కులమేమిటి నాయనా? యింటికెళ్ళి ఎలాగు స్నానం చేస్తానుగా. ఇదిగో ముద్దలు కలిపాను, తిను నాయనా. గొంతిక పడుతుందేమో, అరిచి, అరిచి వున్నావు. తిను నెమ్మదిగా,...నా ఖర్మం కాలిపోను, చెంబు మరచి వచ్చా ...ఎట్లా...దోసిలితో తెచ్చి పోస్తాలే నాయినా... యిక్కడేగా నీళ్లు...తాగు.

వ్యక్తి—హమ్మయ్యా ... యిప్పటికి ప్రాణాలు నిలిచాయి తల్లీ ...ఎంత రుచిగా ఉన్నాయి పదార్థాలు తల్లీ...

సీత—నాయనా, తూర్పు రేఖలారుతున్నయ్...అప్పుడే.కొంచెము యీ చెట్టుకింద కూర్చుని మరీ వెళ్లు. ఆ బట్టలేవి, యిటు తే, పిడిచి ఆరవేసి పోతాను, నేను వెళ్ళి సంటచేయాలె పెందరాండే, ఏనాతండ్రి ఆకలంటూ వస్తావో బాబు, ఆకలి అంటె నాపేగులు తరుక్కు పోతయి బాబు. అదే పిటో కడుపులో చెప్పరానంత బాధగా వుంటుంది. పిడికెడు మెతుకులు పెట్టానా, ఆ బాధ చేత్తో తీసివేసినట్టె పోతుంది.

వ్యక్తి— (సీతమ్మగారి రెండు కాళ్లు పట్టుకుంటాడు) అమ్మా, సీతమ్మతల్లీ...

సీత—ఇదేమిటి నాయనా, నా పాదాలు పట్టుకుంటావు, ఏమంత పెద్ద వుపకారం చేశాననీ? ఆకలైతే అన్నంపెట్టాను ఇంతేనా, నా పిల్లల కాకలైతే పెట్టుకోనూ విడిచిపెట్టు - పాదాలు విడిచిపెట్టు నాయనా...

వ్యక్తి—అమ్మా యీ పరగణాకు నేను జమీందారుని...

సీత—అయ్యో, అయ్యో, రేడ్డి ప్రభువులా తండ్రీ?

వ్యక్తి—తల్లీ, అపచారం చేశాను, నీ అన్నదానాన్ని గురించి లోకమంతా చెప్పుకుంటున్నా, అనుమానించి, పరీక్షింతామని వచ్చాను. క్షమించు, చాలా శ్రమ పెట్టాను. మీరు తరతరాలవరకు ఇలాగే అన్నప్రదానం చేసేందుకు డొక్కా-సీతమ్మగారి అగ్రహారం అనే పేరుతో యీవూరు ఇచ్చేస్తున్నాను. నీవు సాక్షాత్తు అన్నపూర్ణాదేవివి. నీవంటి ఇల్లాండ్లు నా పరగణాలో ఉండబట్టే పరగణా అంతా సుభిక్షంగా వుంది.

సీత—నాయనా, మాకెందుకు అగ్రహారాలు. వాడిచ్చింది, వాడికే పెడుతున్నాం. దీన్నికూడా ఆ ఏలినవాడికే అర్పిస్తాను.

వ్యక్తి—మహారాజులని బిరుదులు పెట్టుకున్నవారెందుకు తల్లీ! నీవంటి లోకమాత ఒక్కత్తుంటే చాలదూ, ఆకలిమంట చల్లార్చటానికి? అదిగో, దాసుడు ఏం పాడుకుంటున్నాడో వినమ్మా...విను.

—(మారాన్న దాసరి పాడుతుంటాడు.) —

సీతమ్మ తల్లికి-చేయెత్తి మ్రొక్కుము
ఆతల్లి సాక్షాత్తు అన్నపూర్ణ,

ఆకలమ్మ అన్నమంటె
ఏకులమువారైనగాని
సకలభక్ష్య భోజ్యములతో
సాకి రక్షించుతల్లి॥ సీతమ్మ॥

—ఆల్ ఇండియా రేడియో.

# గోదావరిగొప్ప

## నందిలేని శివాలయం

శివునివల్ల పుట్టిన్నీ శివుని బ్రహ్మహత్యా
పాతకాన్ని పోకార్చిన గోదావరి పావనత.

మన ఆంధ్రభాష మాతృభాషగాగల ప్రజలు భారతదేశంలోని వివిధభాషాప్రజల్లో మూడోస్థానాన్ని ఆక్రమిస్తున్నారు.

అట్టి ఆంధ్రుల పెద్దనదిఐన గోదావరినదికూడా హిందూదేశపు వివధనదుల్లో నిడివిలో మూడోస్థానాన్ని ఆక్రమిస్తూవుంది. గంగా, సింధునదులు మాత్రమే భారతదేశంలో గోదావరికంటే పెద్ద నదులు.

హిందువులు గంగా, సింధునదుల్ని ఎంతటి పూజ్యభావంతో చూస్తారో గోదావరినికూడా అంతటి పూజ్యభావంతోనే చూస్తారు.

గోదావరి నిడివి తొమ్మిదివందలమైళ్లు. ఇంగ్లీషువారి పెద్దనది ఐన థేమ్సు సైయిన్సువద్ద సముద్రంలో జార్చేనీటికి రెండువందలరెట్లు ఎక్కువనీటిని గోదావరి సముద్రంలోకి జారుస్తుంది. కెయిరోవద్ద నైలునది సముద్రంలోకి జార్చేనీటికంటె రెండింతల నీటిని గోదావరి సముద్రంలోకి జారుస్తుంది.

భారతీయులలో గోదావరి గంగకు అప్పగారు అనే నానుడివుంది. అయినా పవిత్రత విషయంలో భారతీయులు గోదావరికంటె గంగనే ఎక్కువగా ఎంచుతారు. గంగతరవాత సింధుకంటె గోదావరే ఎక్కువ పవిత్రమైనదనే అభిప్రాయం భారతప్రజాలోకంలో బాగా పాదుకొనివుంది.

సింధునదిని హిందువులు, ముహమ్మదీయులుకూడా సమంగా గౌరవిస్తారు.

గంగ దేవలోకవాహిని అని మనవారంటారు. విష్ణుదేవుని కాపురపుకాణాచిఐన వైకుంఠంలో ప్రవహిస్తూవుండేది. విష్ణులోక సంబంధమేకాదు. గంగ సాక్షాత్తూ విష్ణుపాదోద్భవ అని చెబుతారు.

ఇట్టి పౌరాణికగాథలు గోదావరికి చెందినవిన్నీ పెక్కులు వున్నాయి.

అందులో ఒక దానిని విచారిద్దాము.

విష్ణులోకాన్నుండి గంగ పతనమైనది. అప్పుడు అది భూలోకాన్నంతటినీ వెల్లువలో ముంచెత్తకుండా దానిని శివుడు తన జటాజూటంలో నిలిపాడు.

గంగ స్త్రీమూర్తి. దానిని శివుడు శిరమున ధరించాడు. శివుని భార్యఐన పార్వతి ఇదిచూచి భరించలేకపోయింది.

తనకు కలిగిన ఈసవతిపోరు వదలించుకోడానికి ఆమె ఉపాయం వెదకడానికి ప్రారంభించింది. తన కుమారుడైన గణపతితో ఆలోచించింది.

గణపతి తల్లికి ఒక చక్కని ఆలోచన చెప్పాడు. గణపతి ఒక గోవు వేషంధరించి గౌతమఋషియొక్క వరిపొలం తినివేయడానికి ఆరంభించాడు.

గౌతముడు తన చేతికర్రతో నెమ్మదిగా అంటుతూ ఆఆవుని అదలించాడు. ఆ అదలింపుకే ఆదొంగ ఆవు అసువుల్ని బాసింది.

గౌతముడికి గోహత్యాపాతకం చుట్టుకుంది. ఆదోషానికి కాను వానలు కురియడం మానేశాయి. అప్పుడు ప్రజలు అందరూ వెళ్ళి తమ తమ భూములకు ఎట్లాఐనా నీళ్లు

తీసుకురావలసిందని గౌతముణ్ణి ప్రార్థించారు.

అందుమీద గౌతముడు శివుణ్ణి ప్రార్థించాడు- శివుడు ప్రత్యక్షమైనాడు. వరం కోరుకోమన్నాడు- తానుచేసిన గోహత్యా పాతకం పోయి ప్రజలకు జలసమృద్ధి కలగడానికి గంగాప్రవాహాన్ని అనుగ్రహింపవలసిందిగా గౌతముడు శివుణ్ణి ప్రార్థించాడు-

శివుడికి కథ అంతా అర్థమైంది. గణపతి, పార్వతి కలిసి చేసినపనికి అతనికి కొంచెం నవ్వువచ్చింది. ఋషికి వరం ప్రసాదించి గంగను ఇచ్చివేయడంలో పార్వతికి కొంత ఊరటకలుగుతుందికదా అనుకుని తన జడలో బంధింపబడివున్న గంగలోని అందమైన భాగాన్ని చీలదీసి శివుడు గౌతముడికి ఇచ్చాడు- అది వొక పెద్దనది అయింది-

గౌతముడి గోహత్యాపాతకాన్ని పోకార్చింది కాబట్టి అనదికి గోదావరి అనే పేరు వచ్చింది- శివుని శిరముమీది గంగలో అందమైనభాగం చీలిపోయి గోదావరి అవడంతోటే పార్వతి అసూయ చాలాభాగం తగ్గిపోయింది.

గోదావరినదిగా కావడానికి గంగ భూమిమీదకి త్రియంబకముఅనే తావున దిగింది. ఇది నాసిక పట్టణానికి ఇరవై మైళ్ళదూరంలోవుంది-

త్రియంబకంలో కొండకింద ఒక పుష్కరిణివుంది. ఆపుష్కరిణిలో స్నానంచేయడానికి ఏటేట వేల కొలది తైర్థికులు వస్తూవుంటారు

ఆ పుష్కరిణినుండి ఒక సన్నని రాతికాలవ సాగుతుంది. ఆకాలవగుండా నీరు జాలువారుతూవుంటుంది.

త్రియంబకపట్టణం దాటిన తరువాత నది క్రమంగా పెద్దస్వరూపాన్ని పొందుతుంది.

ఏడుమైళ్ళ దిగువాయిని కిక్వి అనేనది గోదావరిలో కలుస్తుంది. కొన్నివందల గజాలు ప్రవహించగా గంగాపురపు జలపాతాలు. పడే ప్రదేశము అంత ఎత్తయినది కాదు, పడే జలమూ అంత ఎక్కువ కాదు. అయినా ఈగంగాపురపు జలపాతాలవద్ద జనితమయ్యే శబ్దంమాత్రం విశేషమైనది.

గంగాపురపు జలపాతాలనుండి ఏడుమైళ్లు ప్రవహించి గోదావరి నాశికపట్టణాన్ని చేరుతూవుంది.

నాశికపట్టణంలో ఎన్నో దేవాలయాలు వున్నాయి. వాటి అన్నిటిలోకి శివాలయము సుందరతమమైనది. అచటి శివుని పేరు కపిలేశ్వరుడు.

కపాలేశ్వరునికి సంబంధించిన పౌరాణికగాథ చిత్రతరమైనది.

ఒకసారి పార్వతికి కులాసాపుట్టి వెనకపాటునవచ్చి తన రెండుచేతులతో శివుని రెండుకళ్ళూ మూసింది. అప్పట్లో శివుడు ఈహాస్యాన్ని హర్షించేధోరణిలో లేడు.

## ఆలుమగళ్ళ అలుకమాటలు

నాకు తిరిగి పెళ్లాడే అదృష్టంపడితే నేను చెప్పినపనులన్నీ చేసే మగవాణ్ణే వివాహం చేసుకుంటాను.

* * *

నన్ను పెళ్ళాడేసరికి నాభార్య వితంతువై వుండినది. ఇప్పుడు తాను తిరిగి వితంతువు కావాలని ఆమె కోరుతూ వుంది.

* * *

ఈ రోజులలో పలువురు పురుషులు పెళ్ళిచేసుకోడానికి వెనుకంజవేస్తున్నారని నాభర్తతో నే నన్నప్పుడు ఆయన ఇప్పటికైనా మగజాతికి వివేకోదయం అవుతూవున్నందుకు ఆనందంగా వుందన్నాడు.

---

కాబట్టి అతడు మూడోకన్ను తెరిచాడు.

శివుడు తెరిచిన మూడోకంటి సెగకు సూర్యుడు, భూమి, బ్రహ్మదేవుని ఐదోతల మండిపోయాయి.

ఇంతలో శివునికోపం శాంతించింది. అతడు మామూలుధోరణిలో పడ్డాడు. సూర్యుణ్ణి, భూమిని తిరిగి కల్పించాడు. కాని బ్రహ్మదేవుని పంచమముఖం మాత్రం తిరిగి కల్పించలేకపోయాడు.

బ్రహ్మదేవుని ఐదోతలను కాల్చివేసిన అపరాధానికి కాను శివుడికి ఒక కొత్తపీడ పట్టుకుంది. బ్రహ్మదేవుని ఐదోతలకాయ అస్తమానూ శివుని కళ్ళఎదుట చిందులు తొక్కుతూ వుండేది.

ఈశిక్ష శివుడికి బహు పీడాకరమైంది. ఈఘోరదృశ్యాన్నుండి తప్పించుకోడానికి శివుడు భారతదేశంలోని అన్ని తీర్థాలూ సేవించాడు. కాని లాభం లేకపోయింది.

తుదకు అతడు గోదావరీతీరానికివచ్చి ఒక చెట్టుక్రింద విశ్రాంతి తీసుకుంటూ కూర్చున్నాడు.

అప్పుడు అక్కడికి సమీపంలో ఒక ముసలిఆవుకు, దాని కోడెదూడకు కింది సంభాషణ జరుగుతూవుండడం అతను విన్నాడు.

ముసలిఆవు కోడదూడతో 'మన యజమాని రేపు నీకు ముక్కుతాడుపోసి నాగలికి కట్టి నీ జీవితాంతంవరకు పనిచేయించడానికి పూనుకోబోతున్నాడు' అని చెప్పింది.

మంచి పొగరులోవున్న ఆకోడె అందుమీద తల్లితో 'అట్టిపనిచేయ తలపడితే అతణ్ణి పొడిచి చంపేస్తా' అంది.

'అతడు బ్రాహ్మడు. నీవు అట్లాంటిపని చేయకూడదు, చేస్తివా నీకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుంది' అని ఆవు బిడ్డకు హితముపదేశించింది.

'బ్రహ్మహత్యాపాతకంనుండి తప్పించుకునే ఉపాయం నాకు తెలుసు' అని కోడె ధిక్కరించి పలికింది.

ఈసంభాషణ శివుని మనస్సుకు బాగా పట్టింది. బ్రహ్మహత్యాపాతకాన్నుండి కోడె ఒకటి విముక్తిని కాంచగలిగితే తానెందుకు అట్టి విముక్తి పొందలేకపోతాను అనే జిజ్ఞాస అతనికి కలిగింది.

బ్రహ్మహత్యాపాతకం పోగొట్టుకోడానికి ఆ ఎద్దు ఏవిధానం అయితే అవలంబిస్తుందో తానున్నూ ఆదేవిధానం అవలంబించి బ్రహ్మదేవుని పంచమముఖ ధ్వంస జనితపాతకాన్ని పోకార్చుకోడానికి శివుడు కృతనిశ్చయుడై నాడు. నాటికి ఇంటికి వెళ్లాడు.

మరునాడు శివుడు తిరిగి అక్కడికి వచ్చాడు. గతదినపు ఆవు, ఎద్దు సంభాషణలో తేలిన రీతిగా అక్కడికి బ్రాహ్మడు వచ్చాడు. వచ్చి కోడెకు ముక్కుతాడు పోయడానికి ప్రయత్నించాడు.

అప్పుడు ఆకోడె ఆబ్రాహ్మడిమీదపడి కుమ్మి చంపింది. అందుతో ఆ కోడెకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంది. ఆపాపఫలితంగా తెల్లటి ఆ ఎద్దు కారునలుపు రంగుకు మారిపోయింది.

అయినా ఆ ఎద్దు కొంచెం కూడా చింత పొందలేదు. తోక పైకెత్తి సంతోషంగా పరుగుపెడుతూపోయి నాశికదగ్గర గోదావరిలో రామకుండం అనే తావున స్నానంచేసింది.

అయోధ్యరాముడు తన తండ్రియొక్క అపరకర్మలు ఈ కుండంలోనే చేశాడు. అప్పటినుంచి దీనికి

## మహావాక్యరత్నాలు

నన్ను మొదటిసారి మోసంచేయి. అది నీకు సిగ్గుచేటు. నన్ను రెండోసారి కూడా మోసంచేయి. అది నాకు సిగ్గుచేటు.

—*Chinese Saying*

... ... ...

ఫిర్యాదుచేసే మనిషి తన్ను తానే పడతోసుకుంటున్నాడన్నమాట. తన్ను తాను పడతోసుకున్న మనిషిని ఎవరు కాని ఉద్ధరించడానికి ప్రయత్నించరు.

—*Halifax*

... ... ...

మంచి పేరుకాని, చెడ్డపేరు కాని ఒకమనిషి వెళ్ళేచోటికి ఆమనిషి కంటె ముందే వెళ్లుతుంది.

—*Chesterfield*

... ... ...

పొగడ్త అనేది యాంబర్ గ్రిస్ అనే సుగంధద్రవ్యంవంటిది. ఆద్రవ్యం ఎంత కొద్దిగావుంటే సుగంధం అంత కమ్మగా వుంటుంది. ఆదే ద్రవ్యపు పెద్ద ముద్ద ముక్కుదగ్గర పెట్టుకుంటే చాలా ఘాటుగా, వెగటుగా వుంటుంది.

—*Pope*

రామకుండం అనేపేరు వచ్చింది.

రామకుండంలో స్నానంచేయగా ఆ ఎద్దు తిరిగి తెల్లగాఐంది. ఆ జలంయొక్క పావిత్ర్యం అట్టిది!

స్నానంచేసే సమయంలో ఆ ఎద్దుతోక పైకిఎత్తుకుని వుండడంచేత నీటిలో మునగకుండా వున్న తోక చివరభాగం నల్లగా వుండిపోయింది.

ఈ సంగతి అంతా శివుడు కనిపెడుతూ వుండినాడు. కాగా వెంటనే అతడున్నూ రామకుండంలో స్నానంచేశాడు. అతని కళ్ళ ఎదుట తాండవం చేస్తూవుండిన బ్రహ్మ పంచమవదనం తోడనే అదృశ్యమైంది.

ఈ సంగతులన్నీ నడిచిన స్థలానికి సమీపంలో కపిలేశ్వర దేవాలయం నిర్మితమైంది. శివునికి కలిగిన శిక్షన్నూ, ఆశిక్షనుండి అతను విముక్తి పొందిన విధాన్ని జ్ఞాపకం చేసే దివ్యస్థల మది.

ప్రతి శివాలయానికి ఎదుట నందివిగ్రహం మోకరించుకుంటూ వుండుకొని వుండడం పరిపాటి విషయంకాని ఈ శివాలయంలో అట్లా లేదు—

ఎద్దు శివునివాహనంగా అనగా శివుని సేవకవర్గానికి చెందినట్లుగా పరిగణింపబడి వుంది— కాని ఈ సందర్భంలో ఎద్దు శివునికి గురుస్థానమైవుంది. బ్రహ్మయొక్క పంచమ వదనం కాల్చివేయడంచేత కలిగిన కాలుష్యాన్ని పోకార్చుకోడానికి శివుడికి ఇక్కడ ఎద్దు ఉపదేశం చేసింది. కాబట్టి ఇక్కడ ఇతర శివాలయాల్లోవలె శివ విగ్రహానికి ఎదురుగా నందివిగ్రహం ఉంచబడ లేదు.

ఈ సంగతి నడిచినప్పటినుంచి ఎద్దులకు అవిపరంగువైనా తోకల చివర నలుపు వుండడం పరిపాటి ఐపోయింది.

ఎవనివల్ల పుట్టిందో అతని పాపాల్ని కూడా కడిగివేయ సమర్థమైన గోదావరియొక్క పావనత కొలదులువెట్ట తరముకానిది.

ఈకథ మహారాష్ట్రంలోని స్థల మహాత్మ్యాలనుండి గ్రహింపబడింది.

గోదావరి మహత్తును తెలిపే ఇట్టి స్థానిక గాథలు ఆంధ్ర దేశంలో అనేక తావులయందున్నూ విస్తరించి వున్నాయి.

తూర్పుగోదావరి జిల్లాలోని ముక్తేశ్వరమువద్ద గోదావరిస్నానం తక్షణంలో ముక్తినిస్తుందంటారు. కోటిపల్లివద్ద గోదావరిలో ఒక్క స్నానం చేయడం కోటిస్నాన ఫలితాల్ని ఇస్తుందంటారు. పైగా అక్కడ నదికి మాతృగమనాపహారి అనికూడా ప్రసిద్ధి.

ఇట్టి గాథల్ని సేకరించి విశేషప్రచారంలోకి తీసుకురావడం ఆంధ్రుల విధిఐవుంది. అభిరుచిగల ఆంధ్రమహాశయులు అందుకు పూనుకుంటారని నమ్ముతున్నాను.

# ఆకుకూరలు

—••••••—

అవిసె – ఉస్తి – కరివేప – కానుంచి – కాబేజీ – కొత్తిమిరి– కోలపాల – గుంటగలగర – గోగు – చక్రవర్తి – చామ – చింత – చిత్రి– చిలుకకూర – చుక్క – తమలపాకు – తుమ్మి – తోటకూర – దొగ్గలి – దోస – నీరుల్లి – పుదీనా – పొన్నగంటి – బచ్చలి – బలుసు – బొద్ది – మునగ – మెంతి – వేప – సరస్వతి– సీకాయ అనే ముప్ఫయి ఒక్కరకాల ఆకుకూరల వివరాలు గలవు. ఆకుకూరల ప్రాశస్త్యాన్ని వివరించే చక్కని పీఠికకూడా వున్నది.

*

## పత్రికల ప్రశంసలు

ఆకులను కూరలుగా వండుకొనియో, పచ్చివిగానే భుజించియో ఆరోగ్య భాగ్యమునకై ఏమేమి లాభములను పొందవచ్చునో తెలుపబడినది. —గోలకొండ.

ఇందులోవున్న విషయాలు అందరూ తెలుసుకోదగినవనేది నిర్వివాదాంశం.

—ఆంధ్ర వారపత్రిక.

చదవనేర్చిన ప్రతిస్త్రీ తప్పక చదవతగ్గ గ్రంథం. —జ్యోతి.

*

వెల

## రెండు అణాలు

పోస్టుబిళ్ళలు పంపేది.

———

ఆంధ్రభూమి బుక్కుడిపో

వేపేరి : మదరాసు.

# తెనుగుగుడి తొలికొలువరి

## శ్రీయుత
## మారేపల్లి
## రామచంద్రశాస్త్రి
## మాన్యత : మహనీయత

ఈ 1941-వ సంవత్సరము నవంబరు నెల 22-23 తేదీలను విశాఖపట్టణములో జరిగిన ఆంధ్రమహాసభ చరిత్రప్రసిద్ధమైనది. ఈసభ జయప్రదముగా నిర్వహింపబడుటకు కారణము బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి అదృశ్యహస్తము.

పేరు ప్రతిష్ఠలకొఱకు ప్రాకులాడక, డబ్బునకు కక్కుర్తిపడక, బహిరంగసభలో వేదికపై నెక్కి ఉపన్యాసమైన చేయనొల్లక కార్యదీక్షానిమగ్నుడై, తెనుగువారి మేలుకొఱకు, తెరచాటున నెంతో చాకచక్యముతో పనిచేసిన ఆ మేటి కొలువరిని ఏకగ్రీవముగా ఆంధ్రమహాసభకు ఉపాధ్యక్షునిగా నెన్నుకొని ఆసభవారు ధన్యులైరనుట నిశ్చయము.

ఉన్నతవంశసంభూతులును విజయనగర మహారాజ కుమారులును, జగత్ప్రసిద్ధ చరిత్రులును, సర్ బిరుదాంకితులును, స్వతంత్ర ప్రియులును, ప్రజాపక్షపాతులును నైన శ్రీ పూసపాటి విజయానంద గజపతి ప్రభువువారు అధ్యక్షులుగను ఉపాధ్యక్షులైన శ్రీశాస్త్రిగారియందు వారు గౌరవముంచి కార్యక్రమము నడపుచుండుట చూడజూడ మనకెంతో ముదావహమగుచున్నది.

ఆంధ్రాభ్యుదయముకోరి, మహాసభాధ్యక్ష్యమువహించి నడుప సమకట్టిన శ్రీ రామచంద్రశాస్త్రిగారి పూర్వసంగ్రహచరిత్రతో పాటు వారు సంస్థాపించి నడుపుచున్న తెనుగుగుడి చరిత్ర తెలిసికొనుట విశాలాంధ్రలోకమునకు ఇప్పుడు అవసరము.

మన ఆంధ్రమాత చేసికొనిన సుకృతఫలమున బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు మన తెనుగుదేశములో జన్మించినారు. చాలాకాలము విశాఖపట్టణములో ఉపాధ్యాయులుగా పనిచేసినారు. అక్కడి ఎ. వి. యన్. కాలేజీకి ప్రిన్సిపాలుగా నుండిన పి. టి. శ్రీనివాస అయ్యంగారు ఒకానొక సందర్భములో మన శాస్త్రిగారిని 'కవి' అని పేర్కొన్నారు. అదిమొదలు ఆ ప్రాంతములవారు వారిని 'కవిగారు' అనియే వ్యవహరింతురు.

### కలాభిలాషకసమాజము

ఆయన దేశాభిమానదీక్షాబద్ధులు. ఆదృష్టితో మనదేశ పరిస్థితులను సూక్ష్మముగా పరిశీలించినారు. అజ్ఞానము, అహంకారము, దారిద్ర్యము, రోగజాలము మొదలగు శత్రువర్గము ఈ నిర్భాగ్యదేశమును ఆక్రమించి పీడించుకొని తినుచున్నదనివారు మొదటనే తెలిసికొనినారు. ఈదురవస్థనుండి తొలగి ఈ దేశమెట్లు బాగుపడునాయని 1893నుండి దురంతమైన చింతనొందుచున్నారు. అంతరాత్మ దేశారాధనకు పురికొల్పగా 1896 లో ఆయన గవర్నమెంటు ఉద్యోగమునకు రాజీనామాఇచ్చి, పిమ్మట 1898 లో ఉపాధ్యాయవృత్తిని అవలంబించెను.

ఆపని చేయుచునే 1899 లో మొదట శ్రీకలాభిలాషకసమాజమను నొక సంస్థను స్థాపనచేసెను. మనప్రజలస్థితిని బాగుచేయుచు సత్కళల నభివృద్ధి చేయుటయే ఈ సమాజముయొక్క ఉద్దేశము. అనేకరోగములతో బాధపడుచున్న ఆర్తులను జలవైద్య, ఆయుర్వేదవైద్య పద్ధతులను ఆయన చికిత్స చేసి, చేయించెను.

పేదలకు విద్యగఱపుటకు రాత్రిపాఠశాల స్థాపించెను. ఉపన్యాసములు, చర్చలు, వాదోపవాదములు, వీనివలన సమాజసభ్యులకు విజ్ఞానాభివృద్ధియగుచుండెను. కవిగారు తాము రచించియు, రచింపించియు నాటకములాడించి ఆ కళాభివృద్ధికెంతో పాటుపడిరి.

## కలాభిలాషక కావ్యమాలిక

శ్రీకవిగారు 1904 సంవత్సరములో శ్రీ కలాభిలాషక కావ్యమాలికను స్థాపించినారు. తెలుగునాట స్థాపితమైన తొలి గ్రంథమాల ఇదే. విజ్ఞానచంద్రిక, ఆంధ్రభాషాభివర్ధనీ మొదలగు గ్రంథమాలికలు దీని తరువాత బయలుదేరినవే.

ఈ కావ్యమాలికలో కవిగారు మొదట ప్రకటించిన 'మానవవిధి, తెనుగు సంధ్యావందనము' అను గ్రంథము కూడ ప్రశంసార్హమైనదే. తెనుగువారు తెనుగు భాషలో ప్రతిదినము రెండుపూటలను దేవుని ప్రార్థించుకొనుటకు అనుకూలముగా తెనుగు సంధ్యావందనము రచింపబడినది. నైతికజీవి అయిన మానవుడు తన విధులను తెలిసికొని అవియెట్లు నెరవేర్చుకొనవలెనో 'మానవవిధి' విశదము చేయుచున్నది.

## ఐందవ హితసభ

బంగాళాదేశము విభజింపబడిన రోజులలో మనము మన స్వదేశవస్తువులనే వాడుకోవలెనను ఉత్సాహము దేశములో చెలరేగను. కవిగారు అప్పుడు విశాఖపట్టణములో దేశాభివృద్ధి సభ స్థాపించి బట్టలనేత దంతపుపని మొదలగు గృహపరిశ్రమలు క్రొత్త పద్ధతుల మీద స్థాపించిరి. దీపావళినాడు భిక్షుల మూలముగ డబ్బు వసూలుచేసి, చేతిపనుల అభివృద్ధికిని, విద్యావ్యాప్తికిని, పేదల కుంగు మాన్పుటకును వినియోగించుచుండిరి.

సిపాయిల పితూరీ దినములనుండి 1908 నాటికి ఏబది సంవత్సరముల కాలము మనదేశములో ఇంగ్లీషుభాష ద్వారా మన బాలబాలికలకు విద్యగఱపబడెను. అందుకు ఫలితముగా మన విద్యాధికులకు హిందూమతమునందు విశ్వాసము చెడినది.

ఈ సంస్థకే కవిగారు రెంతో ముఖ్యించినారు. ఈ ప్రజకు ఏమియును సేవచేయలేనైతినికదా అని దుర్భరమైన ఆవేదన పొందినారు.

## రామలీలోత్సవము

1908-వ సంవత్సరపు పీర్లపండుగ కడపటిరోజున ఒక విచిత్రము జరిగినది. నేటి జయపురం మహారాజావారైన శ్రీ శ్రీ విక్రమ దేవవర్మగారు కవిగారి హృదయావేదనకు కారణము తెలిసికొనిరి. పిమ్మట కొన్నాళ్ళకు వారును, బొడ్డు రామయ్యశెట్టిగారును సంప్రదించుకొనిరి. ఆ దినమున ఉభయులును శ్రీ కవిగారి ధర్మాశ్రమమునకు వేంచేసిరి. హిందూమతము పునరుద్ధరించి హిందూప్రజలకు నూతన ఉత్సాహ వికాసములను కలిగించుటకు అంతకుముందే కవిగారు మనస్సులో ఒక నూతన కార్యక్రమము సంకల్పించుకొనియుండిరి. ఆ కార్యక్రమము చక్కగా నెరవేర్చుటకు కావలసిన ధనసాహాయ్యము చేయుటకు సిద్ధముగా వచ్చినామని శ్రీవారు కవిగారికి తెలిపిరి. సంతోషము పట్టజాలక కవిగారు ఉబ్బి గంతులువైచిరి.

1909-వ సంవత్సరములో విశాఖ

## 1942 పాలిటిక్సు

రాజగోపాలయ్య రాజకీయాలతో
గాంధీకి పతనంబు గల్గితీరు
స్వాతంత్ర్యయుద్ధాన జవహర్లాలుకు
"రెంటికీ చెడుట" సరింపగలను
జైలులో కాలూన సాహసంబుంటవే
హిందూసభకు హాయిగా గెల్పు నోము
కాంగ్రెసుతో చేయి కల్పిన దారలన్న
ముస్లిములీగుకు మొగము మొత్తు
మాటలేల? కమ్యూనిస్టుమతము మారి
రాయి జోస్యంబు చెప్పిన రక్తి గట్టు
సాంబమూర్తికి, దుర్గమ్మ సాయమునను
ఆంధ్రసభ యింక చకబికలాడిపోవు!—

—కొసరాజు రాఘవయ్యా చౌదరి.

పట్టణములో మొదట రామలీలోత్సవము జరిపిరి. నాటినుండి నేటివరకు గత 33 సంవత్సరములనుండి అవిచ్ఛిన్నముగా ఈ ఉత్సవము ప్రతియేడును మహావైభవముతో విశాఖపురిలో జరుగుచున్నది. త్రుప్పు పట్టిన దైవభక్తి ప్రజలలో నానాటికి నిశితమగుచున్నది. పూర్వము నాస్తికతకు నెలవైన విశాఖపట్టణములో ఆస్తికత పెంపొందుచున్నది. మతాభిమానముతో పాటు కళలుకూడ వృద్ధినొందుచున్నవి. ఆర్థికముగా చూచినను, పేదలకు అనేకులకు పనికలిగి ఉత్సవదినములలోనైన కడుపునిండ అన్నము దొరకుచున్నది. చిన్నపిల్లలో సహితము శ్రీరామాయణాంశములయందు కుతూహలముతో క్రొత్త ఉత్తేజము పొడచూపి విద్యాభివృద్ధి కెంతో తోడుపడుచున్నది. తగిన ధనసాహాయ్యమే లభించినయెడల శ్రీ కవిగారి మనస్సులో అణిగియున్న ఎన్నెన్నో సత్ సంకల్పములు చాలకాలము క్రిందటనే ఫలోన్ముఖములై మనదేశ మంతో అభివృద్ధిదశకు వచ్చియుండును.

1913 వరకు విశాఖపట్టణము కెనేడియన్ బాప్టిస్టు మిషన్ హైస్కూలులో తెనుగు పండితులుగా ఉండిన శ్రీ కవిగారికిని, ఆస్కూలు యజమానులకును హిందువులను క్రైస్తవమతములో చేర్చుకొనుటకు మిషన్ వారు చేయు ప్రయత్న విషయములలో అభిప్రాయ భేదములుకలిగి ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చివేసిరి. కవిగారి ఆత్మకు అత్యంత ప్రియమైన హిందూమత పునరుద్ధరణ మహాకార్యమునకు అటుపైనుంచి ఎక్కువ కాలము వినియోగించి పాటుపడుటకు ఇప్పుడు ఎక్కువ అవకాశములు కలిగినవి. మన ప్రజల సర్వతోముఖాభివృద్ధివిషయమై ఆయన విసుగులేక అన్నివిధములను పాటుపడుచునే ఉన్నారు.

విశాఖపట్టణ పురమధ్యమున హిందూ రీడింగ్ రూమ్ అనుపేరుతో 1918 లో పూర్తిచేయబడిన దివ్యభవనము వారి ప్రేరణమూలముగా పునర్నిర్మితమై వారి ఓపికకును, కార్యనిర్వహణశక్తికిని ప్రబలమైన సాక్ష్యము ఇచ్చుచున్నది.

ఇప్పుడు శ్రీ జయపుర సంస్థానాధీశ్వరులును, ఆంధ్ర యూనివర్సిటీ ప్రోఛాన్సలర్ వారును, సాహిత్య సామ్రాట్. డి. లిట్. బిరుదాంకితులును నగు శ్రీ శ్రీ విక్రమ దేవవర్మగారి సాయముతో శ్రీ కవిగారు ఆంధ్రమహాభారతమునందలి మొదటి అయిదు పర్వములును పరిష్కరించిరి.

## భారతభాషాసమితి

గాంధిగారు ఇటీవల భారతదేశోద్ధరణమునకై ప్రారంభించిన కార్యక్రమమును శ్రీ కవిగారు అంతకు ఇరువదియారు సంవత్సరములకుముందే ప్రారంభము చేసినారు. గాంధిగారు 1919 నుండి నాన్ కోఆపరేషనులో దిగినారు కాని శ్రీ కవిగారు 1893 లోనే మొట్టమొదట ప్రభుత్వవిషయమున వైముఖ్యమువహించి హైందవాభివృద్ధికొఱకును; కృషిపరిశ్రమల నిమిత్తమును; పతితులను, దీనులను నిర్భాగ్యులను, అంత్యజాతులను బాగుచేయుటకును ఎంతో ఓపికతో త్రికరణశుద్ధిగా పాటుపడుచున్నారు.

1930 లో ఉప్పుసత్యాగ్రహ సందర్భమున కవిగారు వేలూరుజైలులో ఉన్న దినములలో భారతభాషాసమితి ఆ జైలులోనే స్థాపింపబడినది. సత్యాగ్రహముచేసి ఆ జైలులోనే నిర్బంధింపబడిన మహాపండితులు, బహుభాషావేత్తలు పలువురు ఉండిరి. శ్రీ కవిగారు తయారుచేయుచున్న 'నుడికడలి' అను తెనుగు నిఘంటువునకు వివిధభారత భాషాపరిజ్ఞానము ఎంతో సహకారియగునని అప్పుడక్కడవారు ఈ సమితిని స్థాపించిరి. ఇట్లు శ్రీ కళాభిలాషక కావ్యమాలిక, ఐందవహితసభ, భారతభాషాసమితి, అను నీమూడును శ్రీకవిగారు స్థాపించినవి.

## కవితాసమితి

భాషాభిమానులును భాషాసేవకులునైన కొందరు యువకులు 1926 లో కవితాసమితి స్థాపించిరి. 1927 లో శ్రీ కవిగారు దీని కధ్యక్షులైరి. సభలు జరిపించియు, గ్రంథములు ప్రకటించియు ఈసమితి చక్కగా సేవచేసినది. గ్రాంథికవాదులు, వ్యావహారిక భాషావాదులు నను నీరెండు తెగల భాషాసేవకులకును, కవిగారు సామరస్యముకూర్చి పనిచేయించినారు. 'తెనుగుభాషకును, తెనుగుప్రజలకును సేవచేసి మేలుచేయుటే పరమార్థము. భాష గ్రాంథికము కావచ్చు; వ్యావహారికమును కావచ్చు. అది గ్రంథకర్త ఇష్టము.' అనునదే కవిగారి మతము.

పిఠాపురములో తయారగుచున్న సూర్యరాయాంధ్రనిఘంటువు లోపభూయిష్ఠమైయున్నది. అది నిజముగా సంపూర్ణమైన తెనుగు నిఘంటువుకాదు. ఆ లోపములను సవరించి, వాడుకలోనుండియు ఏగ్రంథముల కెక్కక, నిఘంటువులలో చేరకయున్న పదములను కూడ

చేర్చి 'తెనుగు నుడికడలి'ని కవిగారు తయారు చేయుచున్నారు.

## ఆంధ్రావళీ సమాజము

ఆంధ్రావళీ సమాజము 1929 లో ఎలమంచిలి వాస్తవ్యులగు శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారిచే స్థాపించబడెను. ఆంధ్రాభ్యుదయమునకు అవసరమైన విజ్ఞానము తెనుగునాట వెదజల్లి, సంతోషముకూర్చుచు ఆంధ్రసేవ చేయుటే ఈ సమాజపు ఉద్దేశము.

నీతి, విజ్ఞాన, సాహిత్యములను ఒక్కచోట చేర్చి, వానికి సమన్వయముకూర్చి, భేదభావము తొలగించి, ఏకత్వము నిరూపించి ఆద్వారా ఆస్తికతతో ఆంధ్ర జీవనమునకు సౌభాగ్యోన్నతులు కలిగించుటకు ఈసంస్థ పనిచేయుచున్నది. ఈ సమాజమునకు కూడ అధ్యక్షులు శ్రీ కవిగారే. ఈసమాజము ఈసరికి విశ్వేశ్వరచరిత్ర, నక్షత్రవిజ్ఞానము, మహామేధావులు, నవనభగత్తి మొదలగు గ్రంథములు ప్రకటించి బహుజనాదరణను బడసినది. సమాజస్థాపకులగు శ్రీ రాఘవరావుగారు రచించిన 'అనుదిన విజ్ఞానము' అను విజ్ఞానసంహితను ప్రకటించుటకు ఈ సమాజమువారు ప్రయత్నించుచున్నారు.

మరొక విశేషమేమనగా, ప్రాక్పశ్చిమ వైద్యపద్ధతులను సమన్వయము కూర్చి, మానవులను పీడించు రోగములను నిర్మూలించుటకు ఈ సమాజమువారు గత రెండు మూడు సంవత్సరముల నుండి పాటుపడుచున్నారు.

## తెనుగు గుడి

ఆంధ్రాభివృద్ధికై పాటుపడు సంస్థలన్నియు ఒక్కచోట సమావేశము కావలెను. ఆసమావేశస్థానమునకు తెనుగుగుడి అను నామముండవలయునను భావము 1933 లో కవిగారికి కలిగినది-

గుడియనగా మన యిష్టదేవతను పూజించుకొనుటకు మనము నిర్మించుకొనిన పవిత్రస్థానము. తెనుగుగుడిలో తెనుగుతల్లిని ఆమె కొడుకులును, కూతుళ్ళును పవిత్ర భక్తిభావముతో పూజించుకొందురు.

శ్రీ కవిగారు వయోవృద్ధులు! పండితప్రకాండులు! పవిత్రశీల ప్రభావ విభాసితులు! ఉదారధైర్యహృదయులు.

కాంగ్రెసు యాజమాన్యమున జరుగుచున్న రాజకీయసమరమునుండి విరమింపవలసినదని మిత్రులు కోరినందున, వారు దానితో అంగీకరించినారు. ఆంధ్రజాతికి నేటికి అవసరమైన నిర్మాణ కార్యక్రమము బహువిధముల జరుగవలసియున్నందున వారిటుపై ఆంధ్రసేవయే ముఖ్యముగా నెంచి పనిచేయ సంకల్పించినారు.

వీరు మనకు నాయకులై మనలను నడిపింప గోరుకొనుట మన అదృష్టము. మన జాతీయ జీవనము పునరుద్ధరించుటకును, సత్వరముగా ప్రత్యేకాంధ్రరాష్ట్రము సిద్ధింపచేయుటకును వారు నిర్ణయించిన కార్యక్రమమును వారు ఇచ్చు వివరములతో నిర్వహించుట తెనుగు వారికి పరమ ధర్మమని విన్నవించుచున్నాము.

# కొన్ని రష్యన్ సామెతలు

మంచివాడైనాసరే జర్మనీవాడిని ఉరితీసెయ్యి.

తాగినా, తాగకపోయినా చావు వున్నది. కాబట్టి తాగడమే మంచిది.

ఎవరిమోచెయ్యి వారికి దగ్గరగానే వుంటుంది. కాని దానిని వారు కొరకలేరు.

అధికారం దయ్యానికి సోదరుడు.

మనంపాడే రాగం ఫిడేలు నిర్ణయించింది కాదు.

ధనవంతులు తింటారు; పేదవారు కంటారు.

న్యాయసూత్రాలు ఎక్కువైనకొద్దీ నేరాలు ఎక్కువవుతాయి.

క్షేమంకోసం పెళ్లాడేవాడి రాత్రుల్లు సుఖమయంగా, దినాలు దుఃఖమయంగా వుంటాయి.

పట్టుబట్టలు కట్టబెట్టినా కోతికోతే,

కుక్కలు మొరిగే ప్రతిమనిషీ దొంగ కాడు.

ప్రతి జగడాలమారికి వాడిని తలతన్నే వాడు ఒకడు వుంటాడు.

ఆకలికి మించిన వ్యంజనంలేదు.

కాగితం ఎప్పుడు సిగ్గుపడదు.

మనం చిన్నదొంగల్ని శిక్షిస్తాము; పెద్ద దొంగలికి నమస్కరిస్తాము.

— స్త్రీలనుగురించి —

పడుచుల్ని తప్పుచేయనియ్యడమే మంచిది. లేకపోతే వారికి పశ్చాత్తాపపడడానికి ఏమీ వుండదు.

ఎవడు తన భార్యకు ఎక్కువ స్వాతంత్ర్యం ఇస్తున్నాడో వాడు తనను తానే దొంగిలించుకుంటున్నాడన్నమాట.

*Russian Proverbs by*
*— Dr. Andrew Guershoon*

# విడాకు విచారణ

[ వ్యంగ్య ప్రధానం ]

ప్రతి స్త్రీకీ ఇరువురు భర్తలకును విడాకు లిచ్చే అధికారము ఉండాలి?

రచయిత్రి :

శ్రీమతి బులుసు ప్రకాశమ్మ

౧

'వివాహకాండ స్త్రీకి సౌఖ్యమునిమిత్తం ఏర్పడ్డది. కానిసత్వము కాదు. స్త్రీ తన ఇష్టము వచ్చినప్పుడు వివాహబంధనము నుండి విడిపడుటకు అధికారము కలిగివుండవలెను.'

'వివాహవిచ్ఛేద మొనరించుకున్న స్త్రీ తిరిగి వివాహమాడ దలచినయెడల తన ఇష్టమువచ్చిన పురుషుని వివాహమాడుటకు అధికారము కలిగి యుండవలెను.'

ఇవి మహిళాసభలో ఆనాటి 'విడాకులచట్టం' మీద మాట్లాడిన కొందరు స్త్రీల ఉపన్యాసాలలో ముక్కలు.

నాకు కొద్దిరోజులలో వివాహం కాబోతూంది. ఎవరో ఒకరు 'పెళ్ళికూతురుచూపుల' కంటూ రావడమూ, తరుచు పెండ్లి కొడుకు నాకే నచ్చకపోవడమూ జరుగుతూన్న రోజులు. బాగా నచ్చిన వరుణ్ణి పెండ్లిఆడి పురాణాలలో పతివ్రతలాగ జీవితం ఆదర్శవంతంగా గడపాలని నాకోరిక.

రాత్రి పదిగంటలు దాటుతోంది. నిద్రపట్టడంలేదు. మహిళాసభలో విన్న విషయాలు తలలో గిర్రు గిర్రున తిరుగుతున్నాయి. 'విడాకులచట్టం' అనేసరికి అమ్మలక్కలంతా ఒంటికాలుమీద లేస్తారు ఎందుకని? కాచుకనో! నుంచునో! పిల్లలను పాలిస్తూనో! పక్కవాళ్ళతో ప్రసంగిస్తూనో! మొత్తానికి ఒక్కట్లూ కదలరు, చెప్పేదివినరు. అర్థంచేసుకోరు. మాట్లాడితే భారతదేశం. మాటమాటకీ, సీత, సావిత్రి, దమయంతి అంటూ గోడవేగాని,

సీత, చంద్రమతి, దమయంతి: వాళ్ళని తలుచుకుంటే పాపాలు పోతాయి—పురాణాలలో చాలామంది పతివ్రతల జీవితాలు దుఃఖాలతోనే గడిచాయి. అదికూడా భర్తలవల్లనే:—

తప్పేక్కడుంది ... రేపెవరో చూడ్డానికి వస్తారట: నీకు నచ్చి నువ్వు ఇష్టపడితేనే చేస్తా: ఏసంబంధమైనా: అంటూరు నాన్న.—

పాతికేళ్ళనా రాకముందే [illegible], కాళ్ళు, పేడుకారిపోయిన మొహాలు [illegible], [illegible] ఒరిగిపోయిన శరీరాలు. పెళ్ళికూతుళ్ళని ఇవి ఒద్దని, ఆవిడొచ్చా అని పైగా ప్రాసెస్తానని నేనన్లు — పెళ్ళికొడుకుల తీర్పు ఇవి.

ఇరవై ఏళ్లు దగ్గర పడుతున్నాయి. ఏసంబంధం బాగుండదు. ఎవరూ నచ్చరు. ఓపక్క పతివ్రతలు. ఓపక్క విద్యావతులు. విడాకుల చట్టం. నా ఆదర్శం ఓపక్క— పన్నెండు వినబడుతూంది. నిద్దరోస్తే బాగుండును.

౨

...ఎవరు ఈమె! ముఖం ఎంత కాంతిగా ఉంది! సాత్విక తేజ మంటే ఇదే కాబోలు. చేతులు జోడించి నమస్కరించవలెనని బుద్ధిపుడుతోంది. చూపు, తీరు, ఎంతో అమాయకురాల్లాఉంది. చెంపలని అటూ ఇటూ ఆముచ్చలు. కంటిని కారిన నీటిచారికలు కాబోలు. ఆముతకచీరేకూడా ఆవిడె

వంటిని ఉంటే ఎంతో బాగుండు. పుణ్యస్త్రీలాగే ఉంది. ఒక ఆభరణం లేదు. జుట్టంతా పేనుకొని ఒక్కటే జడ కట్టిపోయింది. బిడ్డలు-బిడ్డలంటూంది. ఈమె పిల్లలెవరు?...

'చిరంజీవీ! ఎంతో గౌరవభావంతో నువ్వు తలుచుకొనే వాల్మీకి రాసిన- సీతను నేనే. వివాహాన్ని గురించి, రాజ్యాలేలే మగవాళ్ళను గురించి చాలా ఆలోచనలు పెట్టుకున్నావు నువ్వు. విను. ఆనాటి స్వయంవరంలో ముందు రాముడు విల్లు ఎత్తేసరికి కంపించిపోయాను. నేను రావణాసుర్ని సభలో చూసినప్పుడే పోతాను- నా రాముణ్ణి పెండ్లాడి నేమేం అని. రాముణ్ణి చూడగానే ఉండలేక అడవులకూడా వచ్చేను. అతడి గొప్పతనానికి ఇంకా గొప్ప తేవాలని లంకలోనుంచి ఆంజనేయుడు వీపుమీద కూర్చోని రమ్మంటే రానన్నాను. ప్రజానురంజకుడు అనే తన పేరు లోకంలో శిలాశాసనంలాగ నిలుపుకొనే సకల కీర్తికి దాసుడై నిండు గర్భవతిని, ఉరుముంటే లేవలేనిదాన్ని అడవికి వెళ్ళగొట్టేడు. అక్కడే అలాగే ఎన్నటికైనా బిడ్డలకు రెక్కలు రావా? కష్టాలు గట్టెక్కవా? అని, నా లవకుశులిద్దర్నీ రెండుకళ్ళలా చూచుకొంటూ రోజులు దొర్లించుకుంటున్నాను. బిడ్డలకి పన్నెండేళ్ళు వచ్చేయి. పిల్లలు నాకు కావాలి అని తీస్కొని వెళ్ళిపోయాడు. దుఃఖం భరించలేక లోయలో దూరి ప్రాణం విడిచిపెట్టేను. ప్రేమకూ,

# భార్య

'పురుషుడికి భార్య చాలా సహాయభూతురాలవుతుందని నా అభిప్రాయం'

'నా అభిప్రాయమూ అట్టిదే. తన్ను పెళ్ళాడకపోతే ఏకష్టాలయితే పురుషుడికి తప్పవుండవో ఆ కష్టాలన్నిటిలో భార్య అతనికి సహాయభూతురాలవుతుంది.'

[illegible] ఇది. తెలివి [illegible] ఎవరో ఒకరిని పెళ్ళాడే [illegible]

౩

నా కేసి వస్తోంది, ఈమెవరు? ఎవరో?

'సాతుత్రియస్త్రీని, చంద్రమతిని నేను. ఎవరినో కాదు. పిండి విసిరి విసిరి- దాస్యము చేసి చేసి చేతులు, ముఖము ఈలా నొక్కుకుపోయాయి. అంతే: పెండ్లికాలమందు. ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి అని చేసిన ప్రమాణికమును విడచి ఆ నేతప్పని సత్యహరిశ్చంద్రుడు అనే బిరుదు సంపాదించాలని ఉద్దేశ్యంతో సమస్తైశ్వర్యం పరులపాలు చేసుకున్న హరిశ్చంద్రుని భార్యను- పాముకరచి పిల్లవాడు చనిపోయిన కొద్దిరోజులకే దుఃఖము భరించలేక నేనూ చనిపోయేను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర్లు మెచ్చుకోవడము అంతా అబద్ధం. కవుల కల్పన అది. బిరుదులకు, పేరుప్రతిష్టలకు వ్యామోహపడి ఉన్నదంతా వెచ్చబెట్టుకొని ఆలుబిడ్డలను అధోగతికి తెచ్చేవాడిని మాత్రం పెళ్ళి చేసుకోకు.'

౪

తడబడుతున్న నడక, బెదరు చూపులు, [illegible] చక్కదనము, చాలీచాలని చీర-సిగ్గుతో ముడుగుని అంతఃపుర స్త్రీలాగుంది ఈమె ఎవరు?

'అవును అంతఃపుర స్త్రీనే నేను. దిక్పాలకులనుకూడా ధిక్కరించి ప్రేమనే ప్రాధాన్యమునిచ్చి నలుణ్ణి పెండ్లాడిన దమయంతిని. నా నలుడికి జూదం (దాన్నే మీరు పేకాట అంటారు) వ్యసనముంటే చాలా ఇష్టం. అటువంటి దుర్వ్యసని ఆతడు భార్య, ప్రపంచము అన్నీ మరిచిపోతాడు. జూదాలాడి, ఇల్లు, వాకిలి సర్వము పోగొట్టుకుని పరులకు ముఖం చూపించలేక పారిపోయిన అతణ్ణి తిరిగి ఇంటికి రప్పించడములో, నేపడ్డ పాట్లు మీరంతా ఎరుగుదురు. ప్రేమ పిచ్చిలో పడి వ్యసనాలకు దాసుడైన వాణ్ణి మాత్రం పెండ్లాడకు.'

౫

మళ్ళీ ఇంకొకరా! మీరెవ్వరు?

......'ఆగు, నీ ప్రశ్నలని కొంచెం ఆపి ముందు నేచెప్పేది విను. స్త్రీల నైతిక సామాజిక అభివృద్ధికి పాటుపడవలసిన విద్యావతులు- పున్నమకేయి గ్రహణంలాగ విడాకుల చట్టమును ఎందుకు తడవవలసి

వచ్చింది? అనే నీ ఆందోళనకు సమాధానం ఇప్పుడు నీకు వచ్చిందనుకుంటాను. నేను ద్రౌపదిని ద్రుపదరాజు కూతుర్ని. తన్ను అవమానించిన ద్రోణుడిమీద ప్రతీకారము సాధించుటకు అగ్ని నారాధించి పుత్రుణ్ణి ఉద్భవింపజేసిన ఆత్మాభిమాని కూతుర్ని. వ్యక్తి స్వాతంత్ర్యము, ఆత్మగౌరవము నాకు క్రమముగా వచ్చాయి.

ద్రౌపదికి (ఒక స్త్రీకి) అయిదుగురు భర్తలను చేసుకోదగినంత అవసరం ఏమివచ్చింది అన్న విషయంమీద మీకాలపువారు చర్చలు చాలా చేస్తూవుంటారు. వ్యాస నిర్దేశమనీ, మాతృవాక్యపాలన మనీ సమాధానములు ఏవోకొన్ని మీకు భారతంలో దొరుకుతూవుంటాయి. దానితో కళ్లుమూసుకుని గుడ్డిగా సమాధానపడి ఊరుకుంటారు మీరు. దాస్యం, పరాధీనత మీలోపాలతో జీర్ణించిపోయింది. సమాధానపడడం మీస్వభావం అయిపోయింది. అంతే మీరనుకొనేటట్లు ద్రౌపది శక్తి, కాళి, పూర్వజన్మలో ఎవరో మునిపత్ని కాదు. ఆమెకూడా మీలాగే మనిషి. స్త్రీ. అంతే. సామాన్య మానవసహజమైన ప్రకృతిశక్తులు ఆమెలోనూ పనిజేస్తున్నాయి. లోకంలోవుండే వీరులలో వీరుణ్ణి (స్వాతంత్రప్రియుణ్ణి) నాకు పెండ్లిచేయాలని నాతండ్రి ఆశపడ్డాడు. పరీక్ష ప్రారంభమయింది. యంత్ర మునుకొట్టి నన్ను పెండ్లిచేసుకోవలెనని ముందుకు వచ్చినవారిలో మొదటివాడు కర్ణుడు. సూర్యుడి వంటి తేజము, కమలమువంటి ముఖము, అతడికోసమే సృష్టింపబడి నట్టున్న కవచము, కాంతులుచిమ్మే కుండలాలు, చక్కదనాలచుక్క— కర్ణుడంటే ఆశపడివచ్చాడు. వర్ణభేదము అడ్డుపడింది. మీలాగే నాకుకూడా ఆనాడు వర్ణభేదపు పట్టుదల బాగావుండేది. సూతుడు రాజపుత్రికను పెండ్లిచేసుకోవడానికి వీలుపడదన్నారు, తాతలు. చిన్నబుచ్చుకుని వెళ్లిపోయాడు. చాలా కష్టమైంది నాకు. ఇంతలో ఇంకొకడు. రూపు, పోలిక, తీరు అంతా కర్ణుడే ముందుకు వచ్చాడు. సంతోషపడ్డాను. జరగవలసినదంతా జరిగింది—

వారింటికి నేను వెళ్ళినతరువాత నాకు తెలిసింది: ఈతడు దాసుడనీ, పెద్దన్నయ్య యెంతచెబితే అంతచేసేవాడనీ, 'ప్రాతఃకాలము నందులేచి పెరనిర్వర్తించి కాల్యాంబులర్ ప్రీతి నన్నతనికి నమస్కరించిగాని చేయరు, ఆ ఇంట్లో ఎవరూ, ఏపనీ- స్వాతంత్రం ఏకోశాన్నీ లేక పరాధీనతకు పాత్రైన దాసుడికి దాసిని కావడంలో నాకానందం లేకపోయింది. బంగారుపాలు తాగడంకంటె ప్రభువై గంజి

తాగడం మంచిద నుకున్నాను. మా అత్త కుంతి నా అభిప్రాయం బాగుందంది మంచిరోజుచూసి పెద్ద క్రోడల్ని చేసింది. దూరపుకొండలు నునుపెక్కువ. దగ్గరగా చూస్తే అన్నీరాళ్ళే. నాకొత్తభర్త ఒక శుద్ధ బుద్ధావతారం- ధర్మశాస్త్రం ఓ చేతులో ఎప్పుడుచూచినా వుంటుంది. 'ధర్మం, అధర్మం, పాపం, పుణ్యం, వారం, వర్జ్యం, పరిశీలన చేయనిదే ఏపనీ చేయడు. సరదా లేదు, మాటలేదు, మంచిలేదు. 'మణిమయమ్ములు కల ధాతువులు సువర్ణమయములు ఆదిగా వలయునట్టి అర్థశాఖలు, ముది కతంబున సిద్ధకోని జూదంబాడుట ఎంతలెస్స' అని యుప్పొంగుట ఆతని స్వభావము——ఒకనాడు మా అత్త మాటవశమున అంది: లాక్షాగృహదహనమునుండి తల్లిని, సోదరులను భీముడు బాహువుల నిరికించుకొని భూవివరమునుండి పరిరక్షించెనని, భీముడు మంచి వీరుడని తోచింది. భీముడికి భార్య




నయాను. కాలం బాగానే గడిచింది. కాని ఆరాక్షసి కేకలు. అశనిఘాతప్రుతిండీ, గద బుజాన్ని పెట్టుకొనిపోయి తిరిగి తిరిగి రాత్రి ఇంటికి జేరడం నాకు నచ్చలేదు. నాకు విసుగుపుట్టింది, అప్పట్లో ఇంట్లో మా అత్తకు, అన్నయ్యలకూ గారాబంగా ముద్దులు కురిపిస్తూ వున్నారు: నకులసహదేవులు. పాలుగారే బుగ్గలు, నవ్వమొగాలు. అశ్వినుల వంటి తేజము. ఎవరూ మాటకు అడుగుదాటరు. నాతో చెప్పనిదే ఏపనీ చేయరు. కార్యేషుమంత్రీ, కరణేషుదాసీ, రూపేచలక్ష్మీ, క్షమయాధరిత్రీ, భోజ్యేషుమాతా గా వారిని స్వీకరించాను. అర్థమయిందా?

రేపటి మీ మహిళాసభలో విడాకులచట్టంమీద తీర్మానములు జరుగనై యున్నవి. వివాహవిచ్ఛేదమొనరించుకున్న స్త్రీ తిరిగి వివాహమాడుటకు అధికారము కలిగి యుండవలెను. అంతమాత్రం అనేసరికే మీరంతా తలక్రిందులై పోతున్నారు. తరతరాలనుంచి శాని సత్వము వంట జీర్ణించిపోయిన మీకు స్వాతంత్ర్యభావములు ఒక్కమాటు రమ్మంటే రావు వినుః ధర్మార్థకామమోక్షములనే చతుర్విధ పురుషార్థములలోనూ పురుషుడు తన అర్ధాంగియందలి తన కర్తవ్యమును ఎంతవరకు విస్మరించి చరించుచుండునో అంతవరకు 'సతికి పతిరన్యో విధీయతే' అని ఉండాలి. ఇందుకు ప్రమాణము ద్రౌపది.

# సామెత

ఒక జాతియొక్క తెలివి, హాస్యప్రియత్వము, తత్వము ఆజాతీయుల సామెతలలో నిగ్గుదేరి వుంటాయి.

—*Francis Bacon*

* * *

ప్రతి సామెత ఈ క్రింది గుణాల్ని కలిగి వుండాలి.

1. సామెత అన్నది ప్రజలనోట బుట్టి ప్రజాసామాన్యంచేత విరివిగా వాడబడుతూ వుండాలి.

2. సామెత అన్నది సంగ్రహంగా, పకడుబందీగా వుండాలి.

3. సామెత అన్నది నడవడిక తీరును దిద్దేదిగా కాని- ప్రజల ప్రపంచజ్ఞానాన్ని తెలిపేదిగా కాని- సున్నిత విషయాన్ని గర్భిత [illegible] న్నదిగా కాని వుండాలి.

— *Dr. Andrew Guershoon*

---

గనుకనే పౌరాణికఋషులు 'అహల్యా ద్రౌపదీ తార కుంతీ మండోదరి స్తథా పంచకన్యాః స్మరేన్నిత్యం మహాపాతకనాశనం' అన్నారు. అందుచేత ప్రతిస్త్రీకి అయిదుగురు వరకు భర్తలకు విడాకులిచ్చుటకు అధికారముండవలెను.

[illegible] రేపటి మీ విడాకుల తీర్మానంగా నన్ను ముందుగా వెళ్ళి ధైర్యంగా ప్రవేశపెట్టు ... అని ఇంకా ఏమో చెప్తోంది——

'అమ్మాయీ !- తెల్లగా తెల్లవారిపోయింది. ఇంకా లేవవేం ?'

అన్న నాన్న కేకతో నాకు మెలుకువ వచ్చింది-

# శ్రీనాథుని కవితలో విధవ ముండలు

తాము రచించే గ్రంథాల్లో కవులు తమకు ఇష్టము వున్నా లేకపోయినా కొందర్ని తిట్టవలసి వస్తూవుంటుంది.

అయితే అట్లా దూషణకు గురిఐనవారు తమ అభిమాన పాత్రులయి వుంటే ఆ కవులు తమ అనంతర రచనల్లో వారిని భూషించి వారిని లోగడ దూషించిన కసటు పోకార్చుకుంటారు.

ఈ విషయానికి మన కవిగ్రామణులయిన సహజ పండితుడు పోతనామాత్యుడు, కవిసార్వభౌముడు శ్రీనాథుడు చక్కని తార్కాణాలయి వున్నారు.

పోతనామాత్యుడు తాను రచించిన భాగవతంలో చతుర్థస్కంధమందలి దక్షయజ్ఞ కథలోని పాత్రలచేత

సీ. అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన
హీనుఁడు మర్యాదలేని వాఁడు
మత్తప్రచారుఁడున్మత్తప్రియుఁడు దిగం
బరుఁడు భూతప్రేతపరివృతుండు
దామసప్రమథభూతములకు నాథుండు
భూతలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్ట
హృదయుఁ డుగ్రుఁడును బరేతభూని

తే. కేతనుఁడు వితతప్రస్తకేశుఁ డశుచి
యయిన యితనికి శివనాముఁ డను ప్రవాద
మెటులు గలిగె? ... ...

అనీ—

తే. వసుధ నెవ్వారు నూర్జటివ్రతులు వారు
వారి కనుకూలు రగుదు రెవ్వారు వారు
నట్టి సచ్ఛాస్త్రపరిపంథులైనవారు
నవనిఁ బాషండు లయ్యెదరు...

అనీ

శివుణ్ణి బాగా తిట్టించాడు.

ఈపాపం పోవడానికిగాను పోతనామాత్యుడు శివస్తుతిప్రతిపాద్యమైన వీరభద్రవిజయం అనే గ్రంథాన్ని రచించాడు. ఈసంగతి మనం ఊహించిందికాదు.

పోతనామాత్యుడే ఈ విషయాన్ని వీరభద్రవిజయంలో ఈ విధంగా విస్పష్టం చేశాడు :

ఉ. భాగవతప్రబంధ మతిభాసురత న్రచియించి దక్షకృ
ద్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁడనైతిఁ దన్నిమి
త్తాగమదత్తదోషపరిహారరతక్రైయజనైకశైవశా
స్త్రాగమ వీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్.

ఇట్టి సంఘటన శ్రీనాథకవి సార్వభౌముని విషయంలోకూడా ఒకటి నడిచింది.

శ్రీనాథుడు తాను రచియించిన కాశీఖండంలో విధవల్ని చాలా నీచంగా వర్ణించాడు.

నడపడంలో తాను ప్రత్యేకప్రజ్ఞను అలవరుచుకున్న సీసపద్యంలో అతడు ఆగ్రంథంలో విధవల్ని ఇట్లా కక్కసించాడు.

సీ. ఓర్పుమై నుప్పిండి నుపవాస ముండనీ
మగనాలి సరిపోల్పఁ దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయంగనీ
మగనాలి సరిపోల్పఁదగదు విధవ
అల నానాదివ్యదేశముల్ ద్రొక్కనీ
మగనాలి సరిపోల్పఁదగదు విధవ
తిరిగి నానాపుణ్యతీర్థంబు లాడనీ
మగనాలి సరిపోల్పఁదగదు విధవ

గీ. నిద్ర మేల్కాంచి రేపాడి నియమపరత
నహిమభానుని వీక్షింప కటకుమున్న
తగదు వీక్షింప నరునకుఁ దల్లి, వదినె,
నత్తగారిని దప్పించి యన్యవిధవ.

'మగనాలి సరిపోల్పఁదగదు విధవ' అనే పల్లవి పెట్టి సీసపద్యం బనాయించి విధవల్ని లాఘవపరచినాడు. ఇంకా దమ్ము చాల దనుకున్నాడు కాబోలు వెంటనే ఒక ఉత్పలమాలలో

జీవముతోడఁ బాసి యశుచిత్వముఁబొందిన మేను గంధతో
యావబృథాభిషేకము సహస్రఘటంబుల నాచరించినన్
బావనమౌనె? యట్ల పతిఁబాసి వితంతుతనొందినట్టి రా
జీవదళాయతాక్షి యశుచిత్వము వాయదు వేలెఱంగులన్.

అనికూడా అన్నాడు. మొదటిపద్యంలో 'విధవ' పదాన్ని, రెండోపద్యంలో 'వితంతువు' పదాన్ని వాడాడు. ముండపదంకూడా వాడుతూ మూడోపద్యం చెబితే కాని వితంతువిదూషణ పూర్తి కాదనుకుని

కాబోలు శ్రీనాథుడు అదే ప్రకరణంలో ఒకగీత పద్యంతో ముండల్ని ఇట్లా నిందించాడు :

గీ. ప్రియము గలిగిన నంగీకరింపవలదు
ముండదీవన రేపాడి మోముఁజూచి
బైసిమాలిన పరమనిర్భాగ్యురాలు
విధవ దాని యాశీస్సుదు విషసమంబు.

పుణ్యస్త్రీయొక్క ఆధిక్యతను చూపడానికి శ్రీనాథుడు ఆప్రకరణంలో విధవల్ని అట్లా లాఘవపరిచి కవితాధర్మాన్ని నిర్వహించుకున్నాడు.

అయితే విధవల్ని ఇంతగా దూషించడం చిత్తంలో శ్రీనాథుడికి ఇష్టంలేదు. శ్రీనాథుడు శృంగార పురుషుడున్నూ, స్త్రీజనపక్షపాతిన్నీ ఐవున్నాడు. అందరు స్త్రీలు అతనికి వరణీయులే.

అందుచేత అతడు గ్రంథాంతరంలో విధవల విలువ ఎంచుతూ పద్యాలు ప్రస్తరించాడు ఈవిషయమై శ్రీనాథుడు ప్రత్యేక కావ్యం వ్రాసివుండకపోవడం ఆశ్చర్యకర విషయంగానే ఎప్పటికీ వుండిపోతుంది.

ఇంతకూ ఈవిషయంలో విధవల అదృష్టం ఈ మాత్రంగానే వుండిపోయిందని మనం తృప్తిపడి ఊరుకోవాలి.

తృప్తిపడి ఊరుకోడానికి ముందు శ్రీనాథుడు గ్రంథాంతరాల్లో విధవల విలువ విపులపరుస్తూ వ్రాసివున్న పద్యాల్ని ఒకపరి మనం పరికించవలసివుంటుంది.

విధవల భోగ్యతా సౌభాగ్యాన్ని శృంగారశ్రీనాథుడు ఇట్లా వర్ణిస్తున్నాడు :

చ. కలసి పెనంగు కౌలమున గాజుల చప్పుడు గాదు కంటికిం
పలరఁగఁ జుంబనక్రియకు నడ్డము గా మెడఁద్రాడు గీడు తే
... ... ... ... ...
వలపుల పుట్టినిల్లు విధవన్ జెడనాడిన నోరుపుచ్చదే ?

'విధవన్ జెడనాడిన నోరుపుచ్చదే?' అని శ్రీనాథుడు మనల్ని అడుగుతున్నాడు. ఈప్రశ్న మనం శ్రీనాథుణ్ణే వేయవలసే వుంటుంది. 'కవి సార్వభౌమా! నీవు కాశీఖండంలో విధవల్ని జెడనాడినావు కదా! నీనోరు పుచ్చిందా?' అని శ్రీనాథుణ్ణి మనం నిలవేసి అడగవలసి వుంటుంది.

ఈప్రశ్నకు శ్రీనాథుడు ఒక్కటే సమాధానం చెబుతాడని తోస్తుంది. కాశీఖండంలో తానుచేసిన దోషానికి పరిహారంక్రిందనే ఈపద్యాన్ని చెప్పడమైనదని అతడంటాడు

కాశీఖండంలో అతడు మూడుపద్యాల్లో విధవల్ని తూలనాడాడు- గ్రంథాంతరంలో విధవల విలువ వెల్లడిపరుస్తూ కూడా అతడు మూడుపద్యాలు చెప్పాడు.

ఒకపద్యం పైన ఉదాహరించే వున్నాను. మరో పద్యంలో అతడు 'వ్యామగ్రాహ్యనితంబబింబ కుచహారాబీలభద్రాకృతుల్, కామాంధల్, ... విధవల్' అంటూ కొనియాడాడు.

మూడో పద్యం కూడా తడవతగిందే. 'విధవా పుంజము లుండఁగ నూరక లంజియలేమిటికి?' అనే ధోరణిలో ఆపద్యం నడిచింది.

ఇతర తెనుగుకవులు కొందరు విధవల మేలెంచుతూ ఒకటి రెండు పద్యాలువ్రాసి వున్నారు. ఆ పద్యాలన్నిటిలోకి

'విధవైన మేలు మగనికి
తిధి వెట్టును........తీర్థము లేగన్'

అనేది మాణిక్యంవంటిది.

అయితే ఆపద్యంలోని విధవ పోయినమగనికే ఇంకా ఏదోరీతిని ఉపయోగించేది ఔతూవుంది. విధవల విలువను తూస్తూ శ్రీనాథుడు వ్రాసిన పద్యాల్లో వితంతువు పరోపకారార్థం ఇదంశరీరమ్ అనే సూత్రానికి తార్కాణంగా వుంటూవుంది.

మొత్తంమీద విధవరాండ్రు శృంగార శ్రీనాథుని చేతుల్లో అటూఇటూ కూడా ఐనారు.

ఇందులో ఇంకో విశేషం. శ్రీనాథుడు—వితంతువుల్ని తిట్టింది అతడు తనపేరుతో వ్రాసుకున్న కాశీఖండంలో—వితంతువుల్ని పొగడింది అతడు వినుకొండ వల్లభరాయని పేరుతో వ్రాసిన క్రీడాభిరామంలో.

ఇందులో విశేషమైనా వుందంటారా ?

# 'జయత్వాంధ్రభూమిః'

గుడ్డితనం పోగొట్టేవాడు ఆంధ్రుడు ;
కాని అతడు కాలుకదిపి గడపదాటడు—
ఆంధ్రభూమి సారవంతమైనది ;
కాని దాని ఫలితం అన్యులకి—

రచయిత :
సాహిత్యవిద్యాప్రవీణ
ములగాల సేతుమాధవస్వామి

'నేను ఆంధ్రుడను. నేను నివసించేది ఆంధ్రభూమి. నేను మాట్లాడేది ఆంధ్రభాష' అని తలచుకుంటే గుండె నీరైపోతుంది.

'సర్వస్స్వార్థం సమీహతే' అనే ఆర్యోక్తి జ్ఞప్తికొస్తే మన ఆంధ్రులను బ్రతికిపోను మనుకుంటాను. మొదట తనను తాను రక్షించుకొనుట తెలిస్తేనేకాని తనకుటుంబాన్ని కాపాడుకోలేడు. తన కుటుంబాన్ని నడపుకొనుట తెలిసిగాని పరిసరములవారికి సహాయపడుట దుర్లభము. అట్లే తన పరిసరములవారిని, పరిసరగ్రామములవారిని, తనశక్తి ననుసరించి కాపాడుచుండినవాడుగాని ఆంధ్రభూమినిగురించి ఆలోచించుటకు కూడ అర్హుడుకాడు. అంటే 'స్వయంతీర్ణః పరాన్ తారయతి' అనే పెద్దలవాక్యమే వ్యాఖ్యానించుట.

'ఆంధ్ర' అనేపదం ఎట్లావచ్చింది అని చాలామంది ప్రశ్నించుకొని జవాబు కోసం ఇంచుమించు ఒకేవిధంగా పొందినట్లుగా తోస్తుంది. 'అంధం రాతీతి త్వాంధ్రః'- గుడ్డితనమును పోగొట్టువాడు కనుక ఆంధ్రుడు- అని. ఈమధ్య కొందరు 'ఆంధ్రుడు' అని కూడ వాడవచ్చు నను చున్నారు. దానినిబట్టి ఆంధ్రభామ, ఆంధ్రభూమి ఇత్యాది ప్రయోగాలు కూడ రావచ్చునన్నట్టు వినికిడి. 'నామ్ని కోవావివాసః' అయినా అది లాక్షణికుల యిష్టాయిష్టాలు. ఆంధ్రశబ్దవ్యుత్పత్తి ననుసరించి గుడ్డితనమును పోగొట్టడం గుడ్డివాని లాంతరులాగ కావచ్చు. చక్షుష్మంతుని బేటరీలైటులాగూ కావచ్చు. అది వివేకావివేకాల్ని అనుసరించి ఉంటుంది. ఇది యిట్లుండ గుడ్డివానిలాంతరుకు వున్న ఉపయోగమే చాలమటుకు మనకు కలదంటే మనం కళ్ళెత్తిచేయ నవసరంలేదు. ఎందుచేతనంటే—

## మనభేదాలు

మనవాళ్లు గుమ్మంకదిలి కబురు చెప్పరు. తమున్న ఊరికి నలుదిక్కులూ ఏవో, ఏం ఊళ్లున్నాయో అంటే మనకి వెళ్ళవలసినపనేముంది అంటాడు. వెనక ఒకాయన స్టేషనుమాష్టర్ని 'మా అత్తారూరికి టిక్కెట్టివ్వండి' అని అడిగాడట. అంటే మనం ఆశ్చర్యపడనక్కర్లేదు. ఇప్పటికీ కూడ మనవాళ్ళలో నూటికి తొంభైమంది అలాంటివాళ్ళే ఉన్నారని నా నమ్మకం. ఒకవేళ ఏఊరైనా వెళ్లినా మాట్లాడటంలో 'ఫుల్లలాయింది' అని విశాఖపట్నంవైపు వారంటే ఛీ! ఛీ! ఎంతముదుగుమాట 'పులుపు ఎక్కువైంది' అనాలి అని గోదావరిజిల్లావాళ్లంటారు. 'పులుపు జాస్తి అయింది' అనాలంటారు నెల్లూరువారు. 'అల్లా, ఇల్లాగు, ఏలాగు' అనే మాటల్ని ఆక్షేపిస్తారు రాయలసీమవారు. మొత్తంమీద మహాభేదం ఉన్నమాటలుంటే నలభై, ఏభైమాటలకంటే ఎక్కువుండవు. అయినా పరిచయం తక్కువవడంచేత ఈ కొద్ది భేదానికే జుట్టూ జుట్టూ పట్టుకుంటారు.

## మనఉద్యోగాలు

ఇంక చదువులూ, ప్రయత్నాలూ చూద్దాం. గట్టిగా నాలుగక్షరాలు దాటని కుఱ్ఱాడికి ముందర చుట్ట నేర్పుతారు మన కృషీవలులు. బళ్లోకి పంపకుండా గొడ్లకాపుకి పంపుతారు. బ్రాహ్మణవృత్తివారైతే సంభావనలకి తిరగడం, చదివితే ఏకొంచెమో చదవడం. మొత్తంమీద పల్లెటూర్లలో వైజ్ఞానికసంపత్తి

చాల తక్కువ. బస్తీలోనైనా ఏ ఉద్యోగస్థుల కుర్రాళ్ళో తప్ప మిగతవాళ్ళకి చదువులే తక్కువ. ఒకవేళ ఏపల్లెటూరి భాగ్యవంతుల కుర్రాళ్ళో చదువ నారంభించారా మాధ్యమికవిద్య (స్కూలు ఫైనలు) పూర్తి అయ్యేటప్పటికి ఆస్తి కూడ పూర్తి కావస్తుంది. ఇంక ఉద్యోగము తనఊళ్ళో వస్తే చేస్తానంటాడు. లేకపోతే గండుగాడు మైళ్ళకు మించి ఉండకూడదు తనఊరికి ఉద్యోగస్థానము. అంతకంటే తెగిస్తే తన తాలూకా. తన జిల్లాలను దాటినట్టయితే ఉద్యోగమే చెయ్యడు.

రాజకీయాల్లో మద్రాసంటే అబ్బో మనకెందుకు లేనిపోని గొడవ అంటాడు మన ఆంధ్రుడు. అంతగా తాత్కాలికంగా ఉద్రేకం కలిగి బయలుదేరినా కార్యదీక్షాపరులైన ప్రకాశంగారిలాంటి నాయకులే ఏంచెయ్యలేక పోయారు మనమేంచెయ్యగలం అని చేతులోఉన్నది కాస్తా ఆర్పేసుకుని రైలుఖర్చులేనా లేకుండా తల వేలాడేస్తాడు.



## ఫలితం అన్యులది

మన మద్రాసు రాష్ట్రములో ఫలవంతమైన భూమి ఆంధ్రభూమి అని చెప్పక తప్పదు. 'భారతభూమీ మనదే కానీ ఫలితము మనదేనా!' అనే గేయాన్ని ప్రస్తుతం మనం 'ఆంధ్రభూమీ మనదే కానీ అందలి ఫలితము అన్యులదే' అని మార్పు చేసుకొని అర్థం తెలుసుకొంటే ఆంధ్రభూమి సార్థకమైనదన్నమాటే. అప్పుడు మనంకూడా సార్థకుల మౌతాం. మన ఆంధ్రదేశములో ఎంతమంది గ్రాడ్యుయేటులు నిరుద్యోగులుగా నున్నారో చూడండి. ఆహా! వారందరికి తెలివి లేకనా? కాదు. ఆంధ్రదేశమున ఆంధ్రుల ప్రాముఖ్యము లేక. అది ఎట్లు? మనమందరము మద్రాసురాష్ట్రియువారము. దీనియందు అరవలు, కన్నడులు, ఆంధ్రులు, ఓఢ్రులు, మళయాళులు మొదలగువారందరు వున్నారు. అవిభక్తకుటుంబములో ఒకడే ప్రయోజకుడైనను ఫలిత మందరిది సమానమే. అంతగా చెప్పాలంటే తినేవాడికి, తిండిపోతువాడికి అధికంకూడా ముట్టవచ్చు. అల్లాగే మద్రాసులో సగంమంది ఆంధ్రులే అయినా ప్రజాప్రభుత్వం వచ్చినపుడు ప్రధాని మనవాడేడీ! ఒక్కడైనా మన ఆంధ్రులలో ఒక విషయంలోనైనా ప్రధానపదవి సంపాదించిన వాడు లేడు. పోనీ మన ఆంధ్రదేశంలోనైనా ఎక్కువ పెద్ద ఉద్యోగులెవరు! అని ప్రశ్నించుకుంటే మన ఆంధ్రుడు కనుపించడు. పోనీ ఒకస్టేషనుదగ్గరైనా మనస్టేషనుమాష్టరు కనుపించడు. విద్యావంతులు లేక కాదు. ఐతేఏం, మనం మన భ్రాతల పొట్ట పెంచి మనం ఉపవాసాలు చేయడాని కలవాటుపడ్డాం.



## తుది మనవి

ఇంతకీ మనసోదరులకు మనవిచేసేదేమిటంటే ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణం ముఖ్యం. అందుకు అనవరతం, సమర్థులైనవారు విసుగుజెందక కార్యసాధకులు కావడ మత్యవసరం. మరి ఇన్ని 'కృషితో నాస్తి దుర్భిక్షం' అనే పెద్దలమాటను మరవక వైజ్ఞానికాదికృషులను పెంపొందించుకోవడం. అప్పుడు నిరుద్యోగ సమస్య చాలామటుకు దూరానికి పోతుందని నమ్మిక, అందరు కృషి కలిగి సంతోషయుక్తులై తనను, తన భాషను, తనమాతృభూమియగు నాంధ్రభూమిని సార్థకమునొందింపగల రేని 'జయత్వాంధ్రభూమిః.'

---

# చీమలు చిరంజీవములు

వరదవచ్చి చాలాభూమి మునిగిపోతుంది. వరద తగ్గిపోయాకకూడా ఆవరద ముంపు భూములలో బ్రతికి బయటపడే ప్రాణాలలో చీమలు వుంటాయి.

... ... ...

ఒకప్పుడు అగ్గిపుట్టి అడవిలో పెక్కు ఎకరాలు ఒక్కసారిగా భస్మీపటల మౌతాయి. ప్రాణాలు ఏవీ బ్రతికి బయటపడనట్లే మనకు కనిపిస్తుంది. కాని చావకుండా మిగిలి చీమలు అధస్థలంలోనుంచి బయటికి వస్తాయి.

... ... ...

శీతలప్రదేశాలలో శీతాకాలంలో మంచు ఎడతెగకుండా కురిసి పెక్కు ప్రాణాలు ముక్కుముడుచుకు పోతాయి. అయితే ఇవతాళించే శీతువు తగ్గిన తరవాత ఆభూమినుండి బ్రతికి బయటపడే ప్రాణులలో చీమలు ముందు పేర్కొనదగివుంటాయి.

... ... ...

చీమలు చిరకాలం ఎట్టి ఆహారం లేకుండా ఉపవసింపగలవు. అమితమైన వేడిని, విశేషమైన శీతువుని తట్టుకుని బ్రతకగలవు. బహుదినాలు వరదలో మునిగి వుండికూడా అవి బతికి బయట పడగలవు.

— *Dr. J. E. Eckert*
*(University of California)*

# భాగోతం : ప్రేక్షకులు

[వీధిభాగోతాలు ఇప్పుడు గోవిందద్వాదశులై వున్నాయి. కాని ఒకప్పుడు అవి మన ప్రజల ప్రధాన వినోద విలాసాలు. ఈ వ్యాసం ఆభాగోతాల సంబంధంలో ప్రేక్షకులు ఎట్లావుండేవారో కొంచెం హాస్యధోరణిలో వివరిస్తున్నది.]

రచయిత :

## అత్తిలి సూర్యనారాయణమూర్తి

(రేడియో ప్రసారిత వ్యాసము)

'ఏమిటీ యీ భాగోతం అంతా?' అంటే

'ఆఁ బ్రతుకే ఓ భాగోతం నాయనా!' అనటం మామూలైంది.

జీవితం నాటకమనీ, తతంగమంతా నటన అనీ ప్రతి ఒక్కరూ నమ్ముతూ వచ్చిన విషయాలు. ఎరిగున్న విషయాలే అయినప్పటికీ, భిన్నభిన్న ప్రకృతులు విడివిడిగా చిత్రించుకుని ఆ అనుభవాన్ని ఆలోచనీయాంశంగా ఉంచుకోటంలో కంటె, కుదిమట్టంలో ఒకే రంగస్థలాన్ని కళ్లు మెరిసేట్టు చేయగలిగినవాడు ఒకరికా యిద్దరికా, పదులూ వందలమీద ఏకముహూర్తాన ఐక్యానుభావమైన హృదయ కదలింపులు సలుపవీలు.

అయితే—

వాచికాంగిక కాఠిన్యం స్వాభావికమైతేనే మనస్సులను పట్టి ఊగిలాడేది. పురాణాలై, ప్రజాజీవితంలో మరగుపడుతూన్న విషయాల్ని ముందుకు తెచ్చి, నీతి అనేది నశించకుండా అరికట్టాలనే ఆవేశం, ఆవేదనా ఫలితంగా 'తోలుబొమ్మలూ, భాగోతం, వీధినాటకం,' పునాది రాళ్లుగా ఉపయోగించుకున్నారు.

మంచుకు లెక్క చేయకుండా పిల్లవాళ్లూ గడ్డమత్తిల నాశ్రయించుకు కూర్చుని,- ఏమంటే మొదట్లో కథ యింకా రక్తికట్టాక కదలవచ్చుననీ, తీరా కాస్సేపు కూర్చున్నాక ఆకథానాయకుడో, నాయికో కష్టాలల్లో ఉండేఘట్టమే కనకవస్తే 'అయ్యో యీపట్టులో వదలి వెళ్ళటం ఎల్లాగ? తమకీ రావొచ్చు యిల్లాంటివి! ఇల్లా వెళ్ళిపొయ్యే ఆసుబ్బావధాని యిన్ని కష్టాలు రాల్చుకుంట!' అనుకొని శుభాంతం చూసి మరీ కదిలేటప్పటికి కాకులు కూసేవి.

'అరె! అరిచ్చంద్రమహారాజు ఎన్ని కష్టాలు పడ్డాడురా? అయితేం ఆడి దుంపతెగ యిస్వామిత్తుడికి లొంగితేనా? సత్తెం అంటె అదీ! అందుకే ఆరికి అన్ని వొరాలు' అనుకుంటూ యిళ్ళకు చేరేవారు.

పాలుకోసారి ప్రజాహృదయాన్ని ఈ సత్యంకేసి మళ్ళించిన ఆ భాగోతంపెద్ద, తాతలు నాయుడుమదుగు [illegible] పెద్దల గుమ్మాలు తొక్కటం ఆరాటజీవనంలోనే. ఈ పెద్దకొప్పు(ప్రేక్షకుడు) తినపైమీద వస్త్రమో, యింతిధాన్యం గాలిచో సంఘం నిర్మించిన పురాణకథానీతి ప్రచుర్యనాటక భవన పునాదులు చపుడు పట్టుగుండా— మట్టుపోయే కాలపుమార్పు ప్రవాహపు తాకుడునించి ఊడి సడలకుండా—పూత మెరుగులు పెట్టి నిలపటం ఆచారమైంది.

ఇక్కడే ఒక్కమాట—

సత్యం అనే ఆదర్శాన్ని ఆరాధించుట ప్రవర్తింపబడాలి. సరే, ఈప్రయత్నంలో సత్యమూ, ఆఖరికి తానూ ఆహుతిఅయ్యే ఘట్టం వచ్చినపుడు తప్పకుండా ప్రజాహృదయాన్ని దోచుకునే పాత్రలు వింటుండాలి. ఆ పట్టులో మనసు తెరే కనక పడలితే ప్రేక్షకజన సంద్రంలో తుఫానురేపే గతులున్నాయన్న విషయం మాత్రం ఆనాటి పెద్దలు అనుకున్నట్టు లేదు అంతగా.

నేటికీ, అదే అనుసరణగా ఉంది. ఔను! పట్టుకున్న పాతసరకు వదలిపోవటం అంత సులువా మరి?

### జడపర్ణస

ఈ వీధినాటకాలలో — భాగోతాల

# బర్మాలో కరెన్ జాతి

## వింతఐనవారి వివాహాచారాలు

*పెండ్లి నిశ్చయం కాగానే వధువు వరునికి కావలసిన దుస్తులు స్వయంగా తయారుచేస్తుంది... పెళ్ళి జరిగేటప్పుడు ఆ ఊరిలోని అవివాహిత యువకులు అందరినీ పొరుగూరు పంపుతారు.*

రచయిత:

**కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్. యమ్. ఇ.**

ఏజాతి నాగరికత అయినా ఆ జాతి వివాహపద్ధతులమీద ఆధారపడివుంటుందనడం అతిశయోక్తి కాదు.

బర్మాదేశం బ్రిటిష్‌వారి అధీనంలో వుండటంవల్ల పాశ్చాత్య నాగరికత ప్రబలినా జనబాహుళ్యంలో విపరీతమైన మార్పులను తీసుకురాలేక పోయింది. ఇకతీసుకు రాలేదు.

బర్మాదేశంలో అనేక జాతుల వారు వున్నారు. అందులో కరెన్ జాతి ఒకటి. ఆ జాతివారు కొండ ప్రాంతములలో నివసిస్తూ కొండ ప్రాంతాలను బాగుచేసి వ్యవసాయంచేసి జీవిస్తూ వుంటారు. వారు నేడు బర్మాదేశమంతటా వ్యాపించి ఉన్నారు. వారి పద్ధతులకు మన పద్ధతులకు చాలావరకు సన్నిహిత సంబంధం ఉన్నట్టు తోస్తుంది.

కరెన్ జాతీయులు ఉపయోగించే వ్యవసాయ పనిముట్లు చాలవరకు మన ప్రాంతాలలో వాడే కొడవలి, నాగలిని పోలే వుంటాయి. వారు ధాన్యమును బల్లమీద కొట్టో, పశువులచేత తొక్కించో నూర్చుకుంటారు. మన ప్రాంతాలలో చేసేటట్టుగానే కుప్ప నూర్పుడు సమయాలలోను, ఆకుపోత సమయాలలోను కోళ్ళను పందిపిల్లలను బలియిస్తారు నదులు, కాలువలు వర్షాకాలంలో వరదలతో నిండివుంటే వాటికికూడా కోడిపిల్లలను బలియిచ్చే ఆచారంవుంది—

మనవారు గడ్డిగాదుల (పురులు)లో ధాన్యము నిలువచేసినట్లే వారు వెదురుపొణకలలో నిలువ చేస్తారు.

ఈ వ్యవసాయంలో స్త్రీలు పురుషులకన్నా ఎక్కువ శ్రమ పడతారు. బర్మాలోని పురుషులు చాల వరకు సోమరులని చెప్పవచ్చు. పురుషులు సోమరులైనప్పుడే ధన ధాన్యాలు అన్యాక్రాంతమౌతూ ఉంటాయి. బర్మాలోని వ్యవసాయదారులకు మన రైతులకుమల్లేనే ఋణపిశాచం పట్టి పీడిస్తుంది.

కరెన్‌జాతి స్త్రీలు ఇంటిపనులన్నీ స్వయంగా చక్కబెట్టుకుంటారు. నీటిని వెదురు గొట్టాలతో నింపి మోసుకొస్తారు. పురుషులు ఇంటిపనులలో కలుగచేసుకోనరు. ఆడవాళ్ళ దుస్తులు మగవాళ్ళ సమీపంలో పడేస్తే మగవారు దానిని న్యూనతగా భావిస్తారు.

కరెన్‌జాతివారు అందరూ కలసి భుజిస్తారు. గృహిణి వంట చేసి ఒక కర్రపళ్ళెంలో అన్నమును గుమ్మరించి వండిన కూరలు వగైర చిన్నచిన్న గిన్నెలలో పెట్టి బల్లమీద పెడుతుంది. ఇంట్లోవున్న వారందరూ ఆబల్లచుట్టూకూచుని భుజిస్తారు. ఎవరైనా అతిథివస్తే గృహిణి అందరితోను కలసి భుజింపదు. లేకుంటే భర్తపజ్జను కూచుని భుజిస్తుంది.

సాధారణంగా యింట్లో అవ్వ వుంటే ఆమెమాట చెల్లుబడి అవు

తూవుంటుంది.

కరేన్ జాతీయులలో వివాహాలుకూడా పెద్దల అభిప్రాయాను సారంగానే జరుగుతాయి.

మగవానికి పాతికేళ్లు వెడితేనే కాని పెండ్లిమాట తలపెట్టనే పెట్టరు. పాతికేండ్లు నిండాక తల్లి తండ్రులు, అవ్వా పెండ్లివిషయం తలపెడతారు. పిల్లవాడు ఎవరినైనా ప్రేమించివుంటే సరేసరి లేకపోతే మధ్యవర్తి తన యిష్టమొచ్చిన సంబంధం సంధానంచేస్తాడు. సర్వసాధారణంగా పెండ్లిమాటలు మగపెళ్ళివారు కదిలిస్తారు.

కరేన్ జాతివారిలో పుట్టబోయే పిల్లలకు ముందుగానే పుస్తి కడతారు. దగ్గర బంధువులుగాని ఆప్త మిత్రులుగాని తమ సంబంధం ఆచంద్రార్కంగా వుండాలనుకుంటే తమకుగాని తమ బిడ్డలకుగాని పుట్టబోయే పిల్లలకు ముందుగానే పెండ్లి స్థిరపరచేస్తారు. ఆవిధంగానే పిల్లలు పుడితే వారి వివాహం ఖాయమన్నమాట ఆ పిల్లలకు యిష్టం లేకపోయినా పెద్దల వాగ్దానాలకు లోబడి వారు సంసారాలు సాగిస్తారు.

కరేన్ జాతీయులు డిసెంబరు నెలలో వివాహములు చేయరు. ఆమాసంలో మృగపక్ష్యాదులు కూడా సంగమించవు కనుక ఆకాలం వివాహానికి మంచిదికాదని వారి మూఢనమ్మకం. అకాలం మన పుష్యమాసానికి సరిపోతుంది. వారు క్షీణచంద్రుడిలో వివాహాలు చేయరు.

పెండ్లి నిశ్చయంకాగానే వధువు వరునికి కావలసిన దుస్తులు స్వయంగా తయారుచేస్తుంది.

పెండ్లికూతురు తాలూకు పెద్దలు కొందరు పెండ్లికొడుకువారికి ఎదురువెళ్ళి వారిని తీసుకువచ్చి విడిదిలో ఉంచుతారు.

పెండ్లిసమయంలో పానీయాదులు అమితంగా సేవించి హద్దుమీరి ప్రవర్తించవద్దని ఆవూరి పెద్దలు వచ్చినవారికి శృతిపడుస్తారు. అయినప్పటికి పెండ్లికొడుకుతో వచ్చిన బ్రహ్మచారి బృందాన్ని ఆపడం కష్టమని కాబోలు, ఆవూరిలోవున్న అవివాహితలు పొరుగూళ్ళకు పోతారు పెండ్లినాటిరాత్రి. ఎవరైనా యింకా దాగివున్నారేమోనని పెండ్లికుమారుడు, వాని బృందం వెతుకుతుందిట. ఒకవేళ ఎవరైనా అట్లా చిక్కితే వారిని ఏడిపించి వదిలేస్తారు.

ఆదేశంలోకూడా కన్యాశుల్కమున్నది. కన్యకు తగిన కట్నం కానుకలు యిస్తేనేకాని పెండ్లి సానుకూలంకాదు. పెండ్లి పూర్తి అయినవెనుక పెండ్లికుమారుడు అత్తవారింట మూడురోజులో, లేక ఏడురోజులో మనుగుడుపులు చేస్తూవుంటాడు.

---

# భాగోతం: ప్రేక్షకులు

౧౧౦-వ పేజీ తరువాయి

కైకే.

సభాస్తారులను వెన్నుచూపి నడచే రంగస్థల పాత్రల్ని నిరసించకపోలేదు. నాతి, నీతి లేనిది ప్రదర్శనార్హంగా భావించలేదు.

అలంకారం

రాగిడి, చంద్రవంక, బంగారపు జడలకు అలవాటుపడిన సీత ఏనాటిదో అయినా, అందెలూ అడ్డబాస త్యజించి, ఉంటే పట్టాలు, అసలు అవిమాత్రమైనాటుకాదా అని తీసివాడి, చెవులలో లకులతో ఒంటిపేట పైటగొలుసుతో ఉంటేనే హాయి అనిపించింది రానురాను.

రాజసింహుని రసపుత్ర దుస్తులూ జాత్రా చెమ్కీలాగు, నెమలితురాయి కోళ్ళీ, స్లిప్పరు పాదరక్షతో సరిపెట్టుకున్నాం.

అడవిలో ఉన్నా రామచంద్రుని కుచ్చుకళలకు తీసికట్టురానుండా, గడ్డం మీసం నున్నగా నంచుకునేట్టూ, జనస్థానాలల్లోని భరతుడుమాత్రం పాపం దీక్షకై జడలు పెంచుకోటానికి అనుజ్ఞ యిచ్చాం.

Printed at the Andhrabhumi Printing Works, 13 Mukhatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher : Andra Seshagiri Rao B.A.

సంక్రాంతికి విడుదల

శాంత వసుంధర వారి

మాయల మరాఠీ (లేక)

# శాంత బాలనాగమ్మ

డైరెక్టరు :

**యస్. వి. యస్. రామారావు**

తారాగణం :

రాజేశ్వరరావు
ముంజులూరి
పరబ్రహ్మశాస్త్రి
డి. లక్ష్మయ్యచౌదరి
గటక్
చలం
రమాదేవి
సుబ్బరత్నం
విమలకుమారి
వరలక్ష్మి
కుమారి
గోపాల్
ధనలక్ష్మి
వగైరాలు




డిస్ట్రిబ్యూటర్సు :—
హేమలతాపిక్చర్సు
గోవిందప్పనాయకర్ వీధి, జి. టి. మద్రాసు.

దత్తమండలములకు :—
న్యూ టాకీ డిస్ట్రిబ్యూటర్సు
నెల్లూరు.

నిజాంరాష్ట్రములకు :—
డెక్కన్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు,
హైదరాబాదు, (డక్కన్.)

REGD. No. M. 4204. ANDHRABHUMI Estd 1933.

2000
వత్సరాల
నాటి ఒక

సారథి
చిత్రం




పతివ్రతా ధర్మ *

కళా
వైభవము
•
కథా
రమణీయత
•
నృత్య
వైదుష్యము

దైరక్టరు :
రామబ్రహ్మం



*Chief Distributors :*
**SARASWATI TALKIES LTD;**
**Bezwada & Bangalore City.**

*For Madras, Tamilnad, Burma & other overseas:*
**SOUTH INDIA PICTURES,**
**Madras.**